# ధన్యకైలాసము

[ నాటకము ]



కవిసమ్రాట్

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ




: ప్రకాశకులు :

కె. యస్. ఆర్. అండ్ సన్సు

పబ్లిషర్సు అండ్ బుక్ సెల్లర్సు

బకింగ్‌హాంపేట P. O. - విజయవాడ - 2.

"సరస్వతీ సామ్రాజ్య" ఆధ్వర్యమున కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు,
శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుపంతులుగారికి కృతిని సమర్పించుట.
సామ్రాజ్యాధ్యక్షులు, గ్రంథాలయోద్ధారక శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు
కవిగారికి చందనతాంబూలాదులర్పించి సత్కరించుట.

# అంకితము

దేశ బంధువు ఆంధ్ర ప్రదేశ ప్రథమ శాసనసభాధ్యక్షుఁడు
శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారికి

---

చూడం గొందఱి కెందుకో యది ఫలించుం దేర రాపాడి రా
పాడ న్నీయటువంటివానికిని గన్పట్టున్ ఫలంబింత రా
పాడ న్నాయటువంటివానికి ఫలప్రాప్త్యాశ లేకుండు నీ
యోడంగట్టినకంబముల్ బ్రదుకు లోహో కర్మయే యోడయై

లీల ఫలియించునట్టి మార్గాలు వేయి
కొంకిబికికి నొక్కనికి రంభ కూడివచ్చు
వయసులో నొక్కనికి లప్ప వచ్చిపడును
వార్ధకమ్మున సామాన్యఫల మొకనికి

ఒక హోదాఘటియిల్లునప్పటికి యోగ్యుండో అయోగ్యుండో తే
లికగానంతయుఁ దేలిపోవు జన మోలిన్ యోగ్యునిన్ గ్రామ గ్రా
మక సన్మానపరంపరాకృత నిలింపప్రౌఢమూర్తిన్ బొన
ర్చక సంతుష్టులుగా నయోగ్యులకుఁబొల్చున్ జీతమే భత్యమై
ఒక న్యాయమ్ము ఘటిల్లె నిప్పటికి నీ కుప్పొంగితి న్నేను సా
ధుకృతింగూర్చెద నీకు నిట్టికలి నెందో న్యాయముంజూచి వే
నికి సంతోసము రాదు సజ్జనునకున్ నీకీ కృతింగూర్చు టే
నొక కోర్కింబడి కానె కాదుచుమి నాకో కైతయే చాలెడిన్

నీవు చేయుదువును నిష్కామకర్మంబు
కర్మయనిన ఫలముకలదు వెంట
ఫలము ననుభవింప వలయుఁ బ్రారబ్ధ ప
రీమళంబు పరిహరింపరాక

విశ్వనాథ సత్యనారాయణ

**17-12-56**

# ధన్యకైలాసము



## నాంది

శ్రీ

శ్రీకైలాస నగాంత ద
రీ కందర గాయమాన ప్రేమరస రవా
స్తోక జయగీతికా ఘుం
టాకలనము దిక్కులంతటన్ జిగురించున్.

(సూత్రధారుడు ప్రవేశించి)

చెఱిగిపోయిన మోక్షలక్ష్మీకుచములఁ
గుంకుమము తీర్చి దిద్దగా గుశలమైన
వితత కరకంకణారవశ్రుతులు దిగ్వి
తానములయందు మారుమ్రోతలు ఘటించు.

పూజ్యులగు నో సభాసదులారా! భగవంతుడగు భరతాచార్యుడు నేడిది యొక క్రొత్తనాటకము సంకల్పించినాడు. ఋషికులతిలకుండగు నామహాత్ముని సంకల్ప మమోఘము. (శ్రుతి) అదిగో! అప్పుడే తెరలో గీతమారంభించినారు

శివ జటాటవీ నట దభ్రసింధు రవము
మ్రోగుచున్నది జయభేరిలాగు చంద్ర
గోళ నిర్గత నిస్వనాలోలమగుచు
లోకకళ్యాణ దివ్య భావాకరముగ.

(నిష్క్రమించును.)

—: ఇది స్థాపన :—

## ప్రథమాంకము

(ప్రవేశము భిక్షుకుడు)

కామక్రోధములనియెడి ఘనవాగురులను జిక్కి
సీమము తెలియఁగజాలక పామరులై చెడిపోదురు
ఎన్నాళ్లో బ్రదుకుదమని యున్నది జనులకు కోరిక
వెన్నాడెడు మృత్యువు కనుగొన్నారో లేదో కాని
ఎన్నాళ్లో॥

(నిష్క్రమించును)

ప్రవేశము—చిత్రలత

తత రసాలమహీరుహాగ్రలతాంతబాణము తొడిగి మదనుఁడు
జతలుజతలుగగుదులుగుదులుగసతులపతులను గుచ్చుచుండగ
ఎవ్వఁడాగఁగ గలడు మదనుని పువ్వుబాణపుకొనల మంటకు
గువ్వ శుకము పికంబు వనమున కెవ్వమని రొదసేయుచుండగ
ఎవ్వఁడాగగ॥

(నిష్క్రమించును)

ప్రవేశము—భోగేశ్వరుడు చిత్రలతను తలుముచు

ఓసీ! అభిసారికా! పోకు పోకవే!
వలపు మాటెటులున్న మీ వాడవారు
వెలయనిన ప్రాణములుకూడ విడుచుచుంద్రు
కడు ధనాఢ్యుల పదముల కందనీరు
వెలవెలందివి కావటవే మృగాక్షి!

(నిష్క్రమించును.)

చిత్రలత—(ప్రవేశించి తొందరగా)

మధుర శృంగారోదయ మిప్పు
మంజులోషఃకాలఖండము

సుధలు జిందెడు తరుకిసాలయ
సుందరోజ్జ్వల మీావిలాసము- ఎవ్వఁడాగగగలను॥
(నిష్క్రమించును.)

(ప్రవేశము-భోగేశ్వరుడు)

వేణుగోపాలస్వామి యాలయములో భామకలాపము చెప్పుటకు వెళ్లుచు నీ పిల్ల జాజిపువ్వులజడ వేసికొన్నది. ఆహా! ఎంత సుమనోజ్ఞమముగాఁ బరిమళించుచున్నది.

ఓ చిత్రలతా!

నైజగికి చెప్పనేలా
తేజవ్వనపుం బసందు లీలలు వాలయున్
జాజుల తావులు వాలసెడు
నీజడకే వలచినాడ నీరజగంధీ

(చూచి) ఓహో! ఇది యిప్పుడే కనుమేర దాటి పోయినదే

"విమల ప్రేమైక రసవిలోలములు నీక
టాక్షముల కింక నోచలేదా! మృగాక్షి!"

(నిష్క్రమించును.)

(ఇరువురు చుండగీడులు ప్రవేశము)

ఒకడు:-(పరిహాసము) ఓరి! నేను దాని బుజముమీాద యెఱు కలవాడు పందిపిల్లను మోసికొని పోవునట్లు పోయెదను.

2 వ వాడు:-అది నా సర్వస్వము. మల్లెతీగ పందిరి కెగ్రాకు నట్లు నామీాద నది యాదరు వేర్పరచుకొనగలదు.

1 వ వాడు:-(తనలో) నేను మోటువాడను. (ప్రకా) వెన్నెల తీగ పున్నాగమునకు వలె నా కది ధృఢ పరిష్వంగ యోగ్య.

2 వ వాడు:-(తనలో) అబ్బో! నాగరికతమిన్న పాండిత్యము.
(ప్రకా) కాకికి పాలసుకండవోలె నాకది భోజ్యము.

1 వ వాడు:-(తనలో) ఓరి! దుష్టుడా (ప్రకా) అదిగో! వచ్చుచున్నది. (తనలో) చిత్రలతా! నీకీ పురుష వృషము పెనవేసికొన యోగ్యమేనా!

2 వ వాడు:- కాదురా! భోగేశ్వరుడుగారు! పదపద! ఆయన మనల చూడకమునుపే పోదము. (తనలో) ఆమె, యేమైనది. (నిష్క్రమింతురు)

భోగే:-(ప్రవేశించి) తరుముచున్న లేడి యేపొదరింట నిమిడినదో! వేటకాని దుఃఖమునకు మేరలేదు. (ఆకసము)

ఈ బహుళ చంద్రరేఖ తానిపుడు పోడుచు
నదిగో తూరుపుదెస వెంట నంటివచ్చు
నా యుషఃకాంతిలో మున్కలై స్రవించు॥

రత్నగిరి-ప్రవేశించి

(ఆకసము) తెల్లవారవచ్చినది. పాపము, భాగీరథికి తెల్లవారలు నిద్దుర లేదు కాబోలు. నేను గాఢముగ నిదురించితిని. పతి ధనాంగనాసక్తుడై యూర నాల్గుదిక్కుల తిరుగుచున్నాడు. తానేమో పసిది. పై దిక్కులేదు. సంసారమును-నిద్ర యెట్లు పట్టు నామెకు?

నిద్రాహీనములైన యామె యెఱ్ఱని జ్యోతులవంటి కనులు చూచిన నాకు ప్రతి యుదయమును భయ మధికమగుచున్నది. అతనితో చెప్పుటకా! పెద్దపులి. అది సముద్రమంతయిల్లు. పిలిచినను చుట్టుపట్ల పిలువందదు.(ఎదురుచూచి) ఆయన యిందే యున్నాడు. (సమీపించును)

భోగే:-రత్నగిరి ! ఇప్పుడెచ్చటనుండి

రత్న:-తమరి గృహమునుండియ

భోగే:-ఎవరికోసము ?

రత్న:-తమరికోసము

భోగే:-ఎందుకు ?

రత్న:-భాగీరథి పిలుచుకొని రమ్మన్నది.

భోగే:-నే నిందుంటినని నీ వెట్లెఱుగుదువు ?

రత్న:-ఆయమ చెప్పినది. ఇప్పుడే యిట్లరిగితివని

భోగే:-ఆమెకెట్లు తెలియును ?

రత్న:-నీ వెన్వతెనో భోగముదానిని లేడిని చిఱుతపులివలె తఱుముకొని పోవుచుండగా నామె యదివరకే పొదరింట దాగియున్న కుందేటివలె యింటి గవాక్షము నుండి నిన్ను చూచినది.

భోగే:-భాగీరథికి నిద్ర!

రత్న:-అది ఆకాశకుసుమము

భోగే:-నీ వందేలయుంటివి ?

రత్న:-ప్రతిదినము మా అమ్మగారాబిడకు తోడు పడుకొనుచుండెడిది. మా అమ్మను నేను మా మేనమామల యూరు పంపించితిని. నేనేపోయి రెండుదినములనుండి యామెకు తోడు పండుకొనుచుంటిని.

భోగే:-(సాలోచనముగ) నీవింక వెళ్ళవచ్చును.

రత్న:-చిత్తము (నిష్క్రమించును)

భోగే:-"వయసులోనిది, యొంటరి, పతి నిరాక
రించినది, యెక్కుపెట్టిన పంచశరుని
ములికివంటిది, సందర్భమున కొఱత
పడని దేరీతిగా బిగ్గపట్టు మనసు
(సశిరః కంపముగ)
కోలచేబూని మదనుడు క్రొవ్విరులను
గుదులుగుదులుగ పైపైన వదలుచున్న
చల్లగాలికి తమి సొమ్మసిల్లు మనసు
భంగపడి యేవిధమ్మున లొంగకుండు
(ఆలోచించి) రాజభవంతికే లక్ష్మి పడిగాపులు పడి
యున్నది. సమృద్ధి. కూతురు రాజేశ్వరినైన చూడదా!

భిక్షుకుడు:-(ప్రవేశించి)
ఎన్నాళ్లో బ్రతుకుదమని యున్నది జనులకుకోరిక
వెన్నాడెడు మృత్యువు కను గొన్నారో లేదో కాని
॥ ఎన్నా ॥

కామక్రోధములనియెడి ఘనవాగురులను చిక్కి
నీమము తెలియగజాలక పామరులై చెడిపోదురు
॥ ఎన్నా ॥

ఇల్లూ వాకిళ్లనుచును పిల్లా మేకాలనుచూ
కళ్లూ తెరవగజాలక ముళ్లల్లో పడిపోదురు ॥ ఎన్నా ॥
హరిహరియని శ్రీరామ స్మరణాచేయుము మనసా
దురితాఖిల సంహారణము పరసౌఖ్యకారణము
॥ ఎన్నా ॥

భో గే:-(అంగీచూచి) నావద్ద కానియు లేదే. సాధనమంతయు రాగలతికాధనాగారమున మూలుగుచున్నది. (పై యుత్తరీయము బిచ్చగానిపై వేయును.) (బిచ్చగాడు పాడుచు నొకవైపుగా, వానినిచూచుచు భోగేశ్వరు డొకవైపుగా నిష్క్రమింతురు)

(చిత్రలత - ప్రవేశించును)

ఇతడు నాయందు చాలదినములనుండి వలపుగొని యున్నాడు. మొన్న నేను రాగలతిక యింటిముందుగ పోవు చుండగ నెత్తిన కన్నుదింపక యట్టె యొకరీతిగ చూచినాడు. నే నప్పుడే గ్రహించితిని. నే నతనివంక చూడవలెననుకొన్న పరులయింటిలోని వాని నేల చూడవలెనని యూరకొంటిని. ఇతడు రాగలతికకు ప్రాణబంధువు. ఉన్న యాస్తియంతయు నిదివరకు సున్నయైనది. కాని మిగిలినది వేలకువే లున్నది. [ఆకసము] తెల్లవారినది. అతనిని పొరపెట్టి యిట్లెత్రోవ వచ్చితిని. ఇంక నతనిని వలలోవేయుట కేది పన్నుగడ? విరసము రాగలతికవైపుననుండి ప్రయోగింతునా? అది మాయలమారి. మొదలే చెడగొట్టునేమో. తొలుత రాగ లతిక కితనికి చెడగొట్టుట యెట్లు? భాగీరథి మూలముననా! బోగముదానిని మరగినవాడు పెండ్లము మాటలు వినునా? [ఎదుట] అదుగో! మాయక్క మిండగాడు కనులు నులుము కొనుచు బోసినోటి తమ్ములు ముమియుచు వచ్చుచున్నాడు. వీని కంటబడిన ముదుసలి వెక్కిరింత. [పెడత్రోవబట్టి] భోగేశ్వరా! చిక్కితివి. చిక్కితివి. భరతశాస్త్రమన్న నీకు మిక్కిలి ప్రేమయట. పాప మాపిచ్చిమధుసూదనుడు చెప్పి

పోయినాడు. (ఆలోచించి) ఇదివరకే భోగేశ్వరుడు నామీద నాసగొన్నాడుగదా! ఈ ప్రయత్న మెందులకు? యెందులకననేల? రాగలతికా ప్రేమతంతువులు శైథిల్యమగుట కొఱకు. రాగలతిక భోగేశ్వరునకు నీళ్ళు వదలుకొనవలసినదే. అందుకనియే రాగలతికతో నాకు పగ. భరతశాస్త్రమిషచేత భోగేశ్వరుని మాయింటికి రప్పింతును. మాయింటికడ నితడుండెనని తెలిసినచో రాగలతిక మామీఁద పడిపోదా! ఓహో! ఇదియా దీనికెత్తు. రాగలతికను ఒకవారము దనుక నేదైన పల్లెటూరునకు మేళమునకు పంపించవలయును. అందులకున్నాడు కదా ధనాఢ్యుడు కమలనాభుని కొడుకు. చిత్రలతచేతి కీలుబొమ్మ. (నవ్వుతో)

ఓసి చిత్రలతా! చిన్నతనములోననే యెన్ని నేర్పులు నేర్చితివి. రాగలతిక నచటినుండి సరాసరి యమపురికంపుదునా. కానిమ్ము అవసరమైనచో నదిమాత్ర మెంతసేపు. పల్లెటూండ్లలో ధనవంతులేమిచేయలేరు. మహోద్యోగులేబడితొత్తులు.

ఇంక భాగీరథియున్నది. అదికూడ పానకములోని పుడకయే. అయిననేమి. చిన్నదైనను చిత్రలత మేధాస్వభావము యుగంధర ప్రతిమానము. వయసువచ్చి సరిగా పది నెలలుకాలేదు. కొంపలుముంచు కొరివియని సాటిబోగము వారు మెటికలు విరుచుటలేదా! నాకుసంగీతమునందున్న ప్రవేశము కవనమునందున్నయెడల పండితులు నావాఁకిటకాగడాలు వెలిగింపరా.

(రెండడుగులు నడచి) నేటి సాయంతనమే రాగలతిక ప్రయాణము. రాతిరి రెండుజాములకు భోగేశ్వరు డస్మద్గృహ ప్రవేశము. (నిష్క్రమణ)

# ధన్యకైలాసము



## ద్వితీయాంకము

భోగే:- (ప్రవేశించి)

"కడువిముగ్ధలు నైజశృంగారరసవి
లీన లంగనల్ వారి వాలిక కనుంగొ
నలకు నర్థమ్ము చెప్ప మానవుడు లేడు"

భాగీరథీ !

భాగీ:- (ప్రవేశించి) ఏమి సెలవు

భోగే:- స్నానమునకు నీరు తోడితివా !

భాగీ:- తమరిప్పుడకదా ! వచ్చితిరి

భోగే:- నేను రాకముందే తోడియుంచరాదా !

భాగీ:- తమ రింత తొందరగా వచ్చెదరని తలచలేదు.

భోగే:- అవును పాపము-నీవు తలచలేవు అయినను నీ కెన్ని పను లున్నవి.

భాగీ:- నా కేమి పనులున్నవి ఏమియులేవు తమరెప్పుడరుదెంచెదరో ఎప్పుడు మీకు సేవచేతునని యే నాతలంపు.

భోగే:- ఓహో! మహాపతివ్రత అందుకనియే మిండగాళ్లతో వ్యవహారింపు.

భాగీ:- ఇవి యేటిమాటలు

భోగే:- నాకు తెలియకపోలేదు.

భాగీ:- నాకు త్రికరణశుద్ధిగా మీకుమిన్న
బరునియందున హృదయంబు పారబోదు
చీల్చిచూడుడు నాదు హృక్షేత్రమందు
నతికియున్నవి మీదు నామాక్షరములు

భోగే:- ఈ మాటలు నమ్మెదరెవరు. పోయి నీరుతేకుము.

భాగీ:- (నిష్క్రమించును)

భోగే:- ఇట్టి కులకాంతపై నేటి కనుమానము. అయినను పరీక్ష కావలసియే యున్నది. (నిష్క్రమించును)

(భాగీరథి-నీరుతోడుచు ప్రవేశము)

ఈ మహాభాగునియందు పూర్వమునకు, నిప్పటికిని తారతమ్యము కనబడుచున్నది. మున్ను తేలెందున్నప్పటికి నుదయముకోడనే యింటి కరుదెంచువాడు. ఇప్పుడు భోజనము వేళకు దక్క రానేరాడు.

"మున్ను తా నెచ్చొ టేగి యెట్టున్నగాని
యింటి కరుదెంచు మందహాసేందురుచుల;
కాలకూటాగ్ని విషములు గ్రమ్మ కనులు
పరపుచున్నాడు నేడు నావంక నితడు!"

రత్న:- (ప్రవేశించి) అక్కా! ఏమి విచారించుచున్నావు.

భాగీ:- ఏ మున్నది నాయనా! బావగారు వచ్చినారు.

రత్న:- (నవ్వుచు) వచ్చిరని విచారించుచున్నావా!

భాగీ:- వేళగానివేళ పరిహాసము.

రత్న:- ఏమైన ననెనా యేమి?

భాగీ:- అట్టిమాటలు నే నిదివరకు వినియుండలేదు.

రత్న:- అవును. ఆయన ప్రవర్తన నాల్గు దినములనుండి విపరీతముగనే యున్నది. విచారించుదమని రాగలతిక యింటికి పోతిని. ఆమె శిరిపురమునకు మేళమునకు వెళ్లినట.

భాగీ:, మఱి యీాయన యెక్కడకు వెళ్లుచున్నారు.

రత్న:- అదే తెలియవలసియున్నది. ఈ క్రొత్తతగులాటముది యెవ్వరో జగజంత. విచారించి కనుగొనెదను. కాని అక్కా నీవు చింత పడకుము. ఒక్కసారి నవ్వుము. నీ వొక్కసారి నవ్వుము. నీ నవ్వుమొగము చూచిన గాని నా కుత్సాహము లేదు. భాగ్యలక్ష్మి నీ మొగమున తాండవించుచున్నదమ్మా సోదరి.

భాగీ:- (నవ్వి) పిచ్చివాడవు.

(దూరమున - భోగేశ్వరుడు - ప్రవేశము)

రత్న:- అక్కా! సెలవు తీసికొందును. (నిష్క్రమించును.)

భోగే:- నారాకవలన నీ కిబ్బంది కలిగినట్లున్నది.

భాగీ:- ఈ మాటలు నా కర్థమగుట లేదు.

భోగే:- అవునవును. అర్థమగుట లేదు. ఛీ! ఛీ! ఏమొగము పెట్టుకుని మాటలాడెదవు. నీ రహస్యము తెలిసినది. ఏమిటి రత్నగిరితో మాటలాడుచుంటివి?

భాగీ:- ఏమియు లేదు.

భోగే:- ఓసి రంకులాడి!

ఏల దాచెదవింక నీకితడు మిండ
కాడు కాడటె నాకు నానాడె తెలిసె

ఎపుడు చిత్రలతా సంగమేప్సితంబు
కొఱకు పోతినో నే వాంఛగూరిగూరి

భాగీ:- (చెవులుమూసికొని) హరి! హరి! ఎంతమాట! ఎంత మాట! రత్నగిరి మనకడుపున పుట్టిన బిడ్డవంటివాడు. ఇవియా మాటలు. (అంతస్సున) తండ్రీ! రత్నగిరి! నీవింక చాలించుకొనుమురా! యిచ్చటికి రాకపోకలు. (ప్రకా) అనుమానము లిట్టివి. దీనికి కారణము తమ ధర్మవ్యతిరిక్తమైన ప్రవర్తన.

భోగే:- (కొట్టబోయి) నోరుమూయుము-ఇంత నేర్చినదానవు బొంకనేర్వవా! నేను వచ్చుచుంటిని. నీవంక వాడు మందహాసములు విరజిమ్ము చున్నాడు. నీవు వాని వంక మోహనముగా జూచుచున్నావు.

భాగీ:- స్వామీ! ఇది యనరానిమాట. క్షమించుడు. రత్న గిరి యెవ్వడు. మన మెవ్వరము.

భోగే:- ఛీ! టక్కులాడకుము. మారుమాటాడితివా (పిడికిలి పట్టి) ఇదిగో! నీ శిరస్సు భిన్నమగును. పద.

(నిష్క్రమణ)

(ఇది విశేషకము)

---

రత్నగిరి:- (ప్రవే) అయ్యా! భోగేశ్వరా! భళి! భళి! తండ్రి తరువాత తండ్రియంతవాడవు. నీ దానకలనా మహా త్మ్యముచేత కాంచనపురి నాలుగువీధులును బ్రాహ్మ ణాశీర్వాదపు పనసలతో మారుమ్రోగుచున్నవి.

ఓ సురలార ! కల్పతరువాల్కెడు సూనములన్ గ్రహించి రం
డో! సుజనోత్తముండు కరుణోదధి సద్గుణవంతుడైన భో
గేశుని మీద వర్షముగ నేకగతిన్ గురిపింపుడింక భా
గ్రతీ సరసీరుహాక్షికి గతించెను పాపభరంబు నేటితో

ఓహో! బ్రాహ్మణోత్తములార! మీ యాశీర్వచనముల తోడనే దిగ్వల్లులు వేదపు చివుళ్లెత్తినవి. మీ యాశీః ప్రభావమున మా భోగేశ్వరుడుగారు వేయికాలములపాటు సకల సుఖము లనుభవించుగాక. అమ్మా! భాగీరథీ! నీ భర్త గారెత్తిన యీ కీర్తిధ్వజము మీ యింటిపై రెపరెపలాడిన చల్లగాలికి మీ చిన్న శిశువు చిరకాలము వర్ధిల్లుగాక. ఈ మహోత్సవము నీవుకూడ చూడవలసినదే. (నిష్క్రమించును)

ఇది విష్కంభము.

(పిదప చిత్రలత ప్రవేశము)

మేడమీద-సాయంకాలము.

ఓహో! ఏమిది! వీధియంతయు జనులతో క్రిక్కిరిసి యున్నది. జనమ్ములు గుంపులు గుంపులుగా గూడియున్నారు. (వెనుతిరిగి) ఓరీ! కంకటుడా! (వీధి) ఎవరో యెత్తైన ప్రదేశమునుండి జనమ్మున కేదియో బోధించుచున్నారువలె నున్నది. (వెనుక) ఓరీ! కంకటుడా! కంకటుడ! పిలిచిన పలుకవేమిరా! నిదురపోతా! ఎందు పరుంటివి ఓసీ! దుర్మతీ! కంకటునిలేపి యిటుల పంపించుము (వీధి) ఎవరో తెల్లనివస్త్రములు కట్టుకొన్న యాజానుబాహువు బారలు చాచి జనమ్ముల కేదియో చెప్పుచున్నాడు.

(వెనుక) ఏమే, ముసలిముండ, కంకటుడు లేవలేదా! వీధి) బజారున నింతజనమెప్పుడును మూగలేదే నేడిదేలనో!

ఏదైన రాజకార్య విషయమా! ఈమధ్య పురపాలకుల ప్రవర్తన బాగుండలేదని యుద్రేకముతో చెప్పినారు భోగేశ్వరుడుగారు. ఆయన కిందేమైన జోక్యమున్నదా! ఆ మనుష్యుని చూచిన యాయనవలెనే యున్నాడు. (వెనుక) కంకటా! ఓసీ దుర్మతీ! కంకటుని నొక్క తన్ను తన్ని లేపుము.

కంక:- (ప్రవేశించి) ఓసీ! పడుచు భోగముపిల్లా! ఎందుకింత గందరగోళము చేసెదవు.

చిత్ర:- ఏడ్చితివిగాని బజారున నేమో జరుగుచున్నది పోయి చూచిరమ్ము. (కంకటుడు :- నిష్క్రమించును

చిత్ర:- ఈ ముండకొడుకు నేపనిమీద పంపించినను తగని యాలస్యముకాని పని చక్కగా నెరవేర్చుకొనియే వచ్చును. (తెరలో మహాధ్వని) జన మామహాను భావుని యుపన్యాస వచనములకు జయజయారవములు చేయుచున్నది. (ఆశ్చర్యము) రత్నవర్షము కురియు చున్నదే! ఓహో! భోగేశ్వరా! ఇది నీవు కాదుకద! కంకటుడు మందగొడి రండకొడుకు. చూడుమింకను రాలేదు. తొందర తెలియదు. ఓసీ! దుర్మతీ! నీ వైననుపోయి యావిషయము సరిగా తెలిసికొని రమ్ము! (ఆలోచించి) నేనుపోదునా! ఛీ! బజారు నకు పోతినేని వయస్సుదాటిన ముదికుంకగూడ నా వంక చూచెడివాడే.

(కంకటుడు-ప్రవేశించును)

చిత్ర:- ఏమిరా! వర్తమానము.

కంక:- భోగేశ్వర మేఘము కనకవర్షము కురియుచున్నది.

చిత్ర:- (ఆతురముగా) భోగేశ్వరుఁడా! కనకవర్షమా ! ఎందు కురా !

కంక:- నే డుదయమున పురపాలకులు సాలునకు పదిరూపా యీలు పన్నీయనివారును స్వంతగృహము లేనివారును పట్టణమున నివసించరాదని చండముగా శాసించిరట. దానికి పౌరులు పెద్దసభచేసి ప్రతిఘటించిరి. పాలకులు దురుసుతనము చూపిరి. జనమ్ములు తల్లడిల్లిపోయి నవి. అప్పుడే భోగేశ్వరుడుగారు గృహమ్ములులేని వారందరకు తాను క్రొత్తగా మామిడితోట వేయు టకై కొనిన నాలుగువందల యెకరముల భూమియు పేదవారి వసతులకై యిచ్చివేసిరి. గృహనిర్మాణము లకు తండ్రిగారి ధనరాసులు విరజిమ్ముచున్నారు.

చిత్ర:- అకటా ! ఇది యేమి విలయము. ఓయి ! భోగేశ్వరా! నీవింత నిష్ప్రయోజకుడవని మొదలనే తెలిసినచో నీ స్నేహ మాసించెడి దాననేకాను. (కం-తో) తరు వాత నేమిరా !

కంక:- తరువాతనా ! జనమంతయు భోగేశ్వరుని దాతృతా విశేషము పొగడుచున్నది. బోగపుపేట రాకపోకల వలన భోగేశ్వరుని ప్రవర్తనలో గలిగిన కొంచెము నలుపును నేటితో తుడిచిపెట్టుకొని పోయినది. బీద సాదలంద రాతని కాలిదుమ్ముకై పెనగులాడుచున్నారు. బ్రాహ్మణులు గాలితో శ్రుతిగలిపి వేదములు ప్రవా యించుచున్నారు. నీవుదక్క తక్కిన యీ యూరి బోగమువా రంద రాతనిచుట్టును నృత్యించుచున్నారు.

భోగేశ్వరుని నేనుగంబారిపై నూరేగింతురట. వలదని యెంత పెనగులాడినను భోగేశ్వరుడిగారి కది తప్ప లేదు.

చిత్ర:- అయినదేమో యైనది. ఉరేగింపులో నింకేమైన ధన వ్యయమున్నదా!

కంక:- ఎందుకు లేదు? చౌణాలుపైనుండి క్రిందనున్న బీద వారలకు ధనము విసరును. వచ్చినజనములలో నవర సులు దొరకనివాడేలేడు. ఇదిగో! నాకు నొకటి దొర కినది (చూపించి) ఆప్రభువు దానకర్ణుడు. దేశమునందలి దుర్భిక్షముచూచి మరల కర్ణుడే యవతరించినాడు.

చిత్ర:- ఆ! కర్ణుడే! చేటచెవుల వెధవా!

కంక:- ఏమే! పడుచుపిల్లా. నీ సొమ్ము పోయిన ట్లేడ్చెదవు.

చిత్ర:- నా సొమ్ముకాక నీ సొమ్మురా: నోరుమూసికొని యిచ్చటినుండి వెళ్లుము.

(కంక - నిష్క్రమణ)

ఇదియేమి పిట్టపిడుగువార్త. నేటితో వాడుచెప్పిన దంతయు నిజమైన యేబదివేలకు తక్కువగునా! అసలెంత ధన ముండి యుండవలయును. కానిమ్ము ఇతనిపని త్వరలోనే ముగింపు కావలెను. ఓరీ! కంకటుడా!

కంక:- (ప్రవే) ఏమి మరల కొంపమీదకు తెచ్చితివి.

చిత్ర:- నోరుమూయుము. భోగేశ్వరుని గృహావర్తమాన ములు కనుగొని రమ్మంటిని, కనుగొని వచ్చితివా?

కంక:- ఆ!

చిత్ర:- భోగేశ్వరుని యింటిలో నెంతమందికలరు.

కంక:- ముగ్గురు.

చిత్ర:- ముగ్గురా? ఎవరెవరు.

కంక:- భోగేశ్వరుడుగారు, అయన భార్య, వారి కుమార్తె.

చిత్ర:- ఆయన కుమార్తెయా! ఈడు?

కంక:- ఎంత, ఏడాది పిల్ల.

చిత్ర:- (తనలో) ఇది అభ్యంతరమే. క్రొత్తచిక్కు వచ్చినదే. కానిమ్ము (ప్రకాశముగా) ఆయనకు తల్లి లేదా?

కంక:- లేదు. రెండు సంవత్సరములక్రింద భోగేశ్వరుని తండ్రి గారు చనిపోయినపు డామె పతిదుఃఖ మనుభవించలేక నూతిలో బడి చనిపోయెనట.

చిత్ర:- (తనలో) ఆహా! సౌశీల్యము. అట్టియామె కుమారుడా భోగేశ్వరుడు. సద్గుణ పరిపూర్ణుడే. కాని యీ జారత్వము (ప్రకా) భోగేశ్వరుని తండ్రి మనపేట కెప్పుడైన వచ్చెడివాడురా? నీ వెరింగియేయుందువు.

కంక:- ఆ సంగతి నాకు తెలియదు.

చిత్ర:- ఆయన ధార్మికుడా యేమైన?

కంక:- ఆయన ధార్మికుడా! ఆరోజులలో నెల కిట్టి కనకవర్షములు మూడు కురిసెడివి.

చిత్ర:- అట్లనా! భోగేశ్వరుడు తండ్రికితగిన కొడుకే. సరి కాని వారియింట ధనమేమాత్రమున్న దేమి?

కంక:- వారియింట అక్షయ ధనలక్ష్మి కాపురమున్నది.

చిత్ర:- ఇంత ధనవంతులాయెను. పరిచారకులైన లేరా!

కంక:- ఏలలేరు; పగలుందురు. మునుపు వంటయావిడ యుండెడిదట. పసిపిల్లయించుక కూర్చుండుట మొదలు పెట్టిన తరువాత ఆయన భార్యయే మాన్పించినదట. ఆమెయెంత నిగర్వి॥ణి. అంతధనవంతులు దేహమునిండ బంగారపు తొడుగులు తొడుగుకొన వచ్చును. ఆమె మెడలో నేదో సంసారపక్షముగా రెండు నగలున్నవి గాని యింక నేవియులేవు.

చిత్ర:- ఇంతేనా! వారింటికి నెవ్వరు రాను పోనుకూడాలేదా?

కంక:- భోగేశ్వరునిగారి తండ్రి మునుపు తమబంధువుల నింట నుంచుకొని చదువు చెప్పించెడువారట. వారు పెద్దవాండ్రై యెవరి సంసారములతో వారుద్యోగపు టూళ్లకు వెళ్లినారు. ఇప్పు డెవరునులేరు. ఇంక నెల నాళ్లకు భాగీరథీదేవి మేనయత్త వచ్చి యిచ్చటనే యుండును.

చిత్ర:- ఇంక నెలదినములకా!

కంక:- అవును.

చిత్ర:- ఇంక నెవ్వరు వారింటికి రారు?

కంక:- ఒక పేదబాపనమ్మవచ్చును. ఆమెయు నామె కుమారుడును వీరిమీాద యాధారము. వారు తఱచుగానే వచ్చుచుందురు. రాత్రులయందామె వీరింటనే పండుకొనును.

చిత్ర:- ఆ కుమారు డెన్ని యేండ్లవాడు?

కంక:- పదునెన్మిది యుండవచ్చును.

చిత్ర:- కొంచెము రూపసియా?

కంక:- చూడ లేదు.

చిత్ర:- (తనలో) వయసులోని వాడేకా? (ప్రకా) ఇంక నేమైన చెప్పవలయునా?

కంక:- ఏమియు లేవు.

చిత్ర:- భాగీరథి తెలివి కలదేనా?

కంక:- మిక్కిలి తెల్విగలదే కాని యామెవద్ద నొకగుణమును కనిపెట్టినాను. భర్తపేరు చెప్పిన నేదైన సరే నమ్మును.

చిత్ర:- (తనలో) బాగున్నది. (ప్రకా) మిగుల కష్టపడితివి. నీవు చాల మంచివాడవు సుమా!

కంక:- అవును.

చిత్ర:- ఏమి కావలయును?

కంక:- నీకు తెలియదా! (ఓరచూపు)

చిత్ర:- ఛీ! ముసలి వెధవా! ఇది తీసుకో (నవరసు)

కంక:- నాకు వలదు. (నిష్క్రమించును.)

చిత్ర:- అన్ని సందర్భములు వీలుగానున్నవి. (సాలోచనముగ) ఇప్పటికి నుచ్చు పన్నబడినదన్న మాటయే. అక్షయధనలక్ష్మి! భోగము వారింట కాపురముండెదవా?

( తెర )



# ధన్యకైలాసము



## తృతీయాంకము

( ప్రి-పుష్పమాలాలంకృతుడై భోగేశ్వరుడు )

ఆరనిదైన రాగలతికాంచితరాగసుధాంబుపూరసం
చారముకన్న చిత్రలత చక్కదనమ్మునకన్న మూడు భా
గీరథి నిర్మలంబయిన కేవల భక్తియుకన్న కీర్తిక
న్యారుచిరాననంబె హృదయంబున కెక్కెడు వింతవింతగన్

అనవసరముగ భాగీరథి ననరానిమాట లని వృథా వైమనస్యము ఘటించుకొని మా యింటిముం దేనుగు పోవు చున్నప్పుడు మా భాగీరథి నా వంక చూచినచూపులు నేను మరవగలనా. అట్టి నిరాశమును కల్మషరహితమునైన ప్రేమ యింటివద్ద భద్రముగా నున్నదను నమ్మకము నన్ను చిత్రలత యింటిముంగిటికే లాగుకొని వచ్చినది. కానిమ్ము ఇదియే చిత్రలత యిల్లు. ఎవరక్కడ! కంకటుడా!

కంక:- (ప్రవేశించి) బాబుగారికి దణ్ణములు. దయచేయుడు. ఓసీ! చిత్రలతా! అయ్యవారు వచ్చినారు, సేవించుటకు రమ్ము. (కంక-నిష్క్రమణ)

చిత్ర:- (ప్రవేశించును.)

భోగే- (పరధ్యానముగ) రత్నగిరి నెంతమాట యనినాడను. నే డతని యుత్సాహము, భక్తియు చెప్పనలవిగానివి.

అట్టి నిర్వ్యాజమగు ప్రేమ సకళంకమా! నాయనా! రత్నగిరి! క్షమించుము. ప్రేయసీ! భాగీరథీ! కాంచన పురము నా కొసంగిన యీ పుష్పమాలా బహుమానము నీ పాదముల యొద్దనుంచి నిన్ను ప్రతిమాలు కొందును.

చిత్ర:. మహాభాగులు పరధ్యానముగా నున్నారు!

భోగే:- నిన్ను గురించియే యాలోచించుచున్నాను.

చిత్ర:- ఏమని ?

భోగే:- ఇంక రాలేదని.

చిత్ర:- నేడు ప్రొద్దుగ్రుంక వచ్చినది. తమ రింక రాలేదేమని నేనును మేడపైనుండి ఎదురుజూచుచున్నాను. పవల్ల్ల భాగీరథీదేవిగారితో మంతనములా!

భోగే:- అవి జరిగి చాలదినము లైనది.

చిత్ర:- కారణము ?

భోగే:- వెగటాయి.

చిత్ర:- పురుషులు నూతన ప్రియులు !

భోగే:- ( సాపాంగము ) సౌందర్యము ముహుర్ముహుర్నవీకృతము.

చిత్ర:- సౌందర్యమునందు మోహమేగాని నిజమైన ప్రేమ యింటియందే యుండును.

భోగే:- సౌందర్యమందలి తృష్ణ భోగేశ్వరునకు చల్లారదు.

చిత్ర:- (తనలో) ఇప్పుడువీలు (ప్రి) సౌందర్యము వెంటబడి మీరిట్లు తిరుగుచుండ నింటివద్ద ప్రేమ కలుషితము కాదో !

భోగే:- భార్యాభర్తృప్రేమసూత్రములు బ్రహ్మఘటితములు. వానికి శైథిల్యము లేదు.

చిత్ర:- కాని స్త్రీలతి చంచలచిత్తలు.

భోగే:- చిత్రలతా! అది నిజమేకాని మా భాగీరథిప్రేమ యనిర్వచనీయము.

ఏమనునో యంచు నేదేని హాస్యమ్ము
చేసిన మొగమింత చేసుకొనును
అంత పాపమటంచు నతికృప మనసిచ్చి
యొక్కింత మాటాడ నుబ్బిపోవు
నుబ్బి సంతోషమై యున్న వేళలయందు
శృంగార చేష్టల సిగ్గుపడును
సిగ్గుచే తలవాంచి చెంతనిల్చిన చూచి
గడ్డమెత్తిన యోరగాగ నవ్వు
నవ్వి చనవున బుజముపై నను కరంబు
నునిచి లోని ముదంబు పైకుబుకనీక
మోముతామర వికసింప ముగుద పలుకు
పలుకు పలుకున కపురంపుపలుకు లొలుక

చిత్ర:- (తనలో) నా కార్య సాఫల్యమునకిట్టి ప్రేమ సమూలముగ ఛేదింప తగినది. (ప్రకా) నేనొకటి చెప్పెదను; తమకు గోపము వచ్చునేమో!

భోగే:- నీ మీదనా!

చిత్ర:- ఇవి స్త్రీలు సహజముగా నేర్తురు ఇందు ప్రేమయున్న దనవలసిన యవసరము లేదు.

భోగే:- ఇది కాకపోయిన నింక ననేకములున్నవి.

వెనుకగ బాల కాల్బొటన వ్రేళ్లసయిన్ జనుదెంచి మెల్ల నా
కనులనుమూసి యింతవడిగా నగు చెవ్వరొ చెప్పికొండనన్
వినియును నేను నీ పలుచ వ్రేళ్లను తీయనివాక్కు నీవు దా
చిన వెలిపెట్టుగుట్టనుచు చేయి తెమల్చి కవుంగిలించుమన్ ॥

ఇవన్నియు మా తండ్రిగారినాటి మాటలు. వారు గతించిన తరువాత సంసారభారము నా మీద పడినది. మా భాగీరథి పిల్లలతల్లి యయినది. ఆమెకడ తరువాత ప్రేమ రసమేకాని శృంగారరసము కనబడలేదు. అప్పుడే శృంగార రసఫలవాంఛరాగలతికాబాహులశాఖల కెగాబ్రాకితి. రాగ లతిక కూడ క్రమక్రమముగ భాగీరథితోపాటైనది. దాన జేసియే నేడు చిత్రలతా వదనసరోజదర్శనమహాభాగ్యము.

చిత్ర:- (సిగ్గుతో) తమరి మహాప్రసాదము. నా దొక మనవి.

భోగే:- కా దాజ్ఞ.

చిత్ర:- భాగీరథీ దేవిగారిని నే నొకసారి చూడవలెనని యున్నది.

భోగే:- ఇది కోరికయా! భాగీరథిని చూచిన నీ కేమున్నది. వట్టి ముద్దరాలివలె నున్నావు. నగలో, మేడలో, ధన రాసులో, మాణిక్యములో యేమికావలయునో కోరు మిచ్చెదను.

చిత్ర:- అయ్యా! చిత్రలతకు శ్రీ భోగేశ్వరుని యందలి ప్రేమ యాయన ధనముచూచికాదు. ఆ మహాభాగుని సుగుణ సంపత్తిని చూచి.

భోగే:- (తనలో) ఆహా! ఇదియు రాగలతికవలె సుగుణ వంతురాలు. (ప్రకా) చెలీ! నీ వెప్పు డేది కోరిన నది

యిచ్చుటకు నీ మేనువు దగ్గరనే యున్నది. ప్రస్తుత మిదితీసికొనుము. (అని మెడలో పుష్పమాల తీసి చిత్రలత మెడలో వేయును.)

చిత్ర:- ఓరీ! కంకముడా! దుర్మతితో తాంబూల కరండిక తీసికొని రమ్మను. కాదు; నేన పోయి తెచ్చెదను.

(నిష్క్రమించును.)

భోగే:- (విచారముతో) అక్కటా! భాగీరథీ కల్యాణ కంఠ యోగ్యమగు సుమమాలిక చిత్రలతాగళ సమర్పిత మైనది.

చిత్ర:- ఏమో దిగులుగా కూర్చుంటిరేమి?

భోగే:- ప్రొద్దుననుండి భోజనము లేదు.

చిత్ర:- ఏమైన ఫలహారములు తెప్పింతునా!

భోగే:- కాదు! భోజనమున కింటికే పోయెదను. (లేచును)

చిత్ర:- చిత్తము. తమరు నేడింటివద్దనే యుండుడని నా ప్రార్థన.

భోగే:- ఏల?

చిత్ర:- ప్రేమవతియగు గృహిణి శోకించరాదు. అదియుంగాక తమ యౌవనము నిరంతర వారకాంతా—

భోగే:- నీ సౌశీల్యము పొగడదగినది (అంతస్సున)

భాగీరథీ! నీవు ధన్యురాలవే. రాగలతికా చిత్రల తలు నీయెడ నీర్ష్యాగ్రస్తులైన నామన స్సెట్లుండెడిదో?

చిత్ర:- తమరు దయచేయుడు. (అని త్రోవ చూపును.)

(తెర)

(కంకటుడు ప్రవేశించును.)

అక్కటా! నా బ్రతుకంతయు నిట్లే సరిపోయినది. యౌవనము నీలాలక పాదసేవతో చెల్లినది. మధ్యకాలము నగరాజకుమారి శుశ్రూషకైనది. దానిమధ్య, దానివిటుల మధ్య తిరుగలేక నా కాళ్లు కండెలు కట్టినవి. ఇప్పుడు చిత్రలత వచ్చినది. ఇది వారందరికన్న నేడాకులెక్కువ చదివినది. కూచిపూడి బ్రాహ్మణుల తన్నులు తినినేర్చుకొన్న నా పగటి వేషముల నేర్పు వీళ్ళ సేవకు వినియోగించితిని.

నా వంటి నిర్భాగ్యులెందరున్నారు. నేటి కీభోగేశ్వరు డొకడు కనంబడినాడు. చిత్రలత యింటి పంజరపు చిలుక యైనాడు. రీతిచూచిన భోగేశ్వరుని కొంప కేదియో చేటు వచ్చునట్లేయున్నది. దీని ఆలోచనలు, దీనియెత్తులు, దీని దుంపతెగ! దీనిమాట వినకపోతినా! గాఢనిద్రపొంద వీలు లేదు. ఏరాత్రివేళ యీ ముసలి యస్థిపంజరమున చురకత్తి దిగునో? ఓయీ! జగద్రక్షక! భోగేశ్వరుడుగారి సంసార భారము నీది. (నిదానించిచూచి) అయ్యా! ఎవరా వెళ్లునది? రత్నగిరియను కుఱ్ఱాయన భోగేశ్వరుడుగారి స్నేహితుడట! ఆయన యిల్లెక్కడ (ఆలకించి) ఆ కుడివైపున నున్న చిన్న కుటీరమా! సరి! (కొంచెము నడచి) అమ్మా! రత్నగిరి గారింట నున్నారా!

(తెరలో)

ఎవరు వారు?

కం:- అయ్యా! నా పేరు కంకటుడు. తమతో నొకమాట యున్నది.

రత్న:- ఏమిపని ?

కం:- చిత్రలతయను భోగముపిల్ల క్రొత్తగా తొలకరించిన వయసులోనిది. నగరాజకుమారి చెల్లెలు తమ కొక యుత్తరము పంపినది.

రత్న:- ఛీ. అవతలకు పొమ్ము.

కం:- ఇదియేదైన వ్యవహార విషయమేమో ?

రత్న:- పిచ్చిమాటలాడకుము. నాతో దానికేమివ్యవహారము.

కం:- ఉత్తరము చూచుకొండు. తరువాత తమకిష్టము లేకున్న నా మొగమున పారవేయుడు.

రత్న:- కమ్మ యేది ?

కం:- (ఇచ్చును.)

రత్న:- లోపల దీపము వెలుగున చదివి వచ్చెదను. ఇంద యుండుము.

కం:- ఈయనవాక్కు కఠినము. నిష్క్రమణ యోగ్యమువలె నున్నది. (నిష్క్రమించును)

రత్న:- (దీపమువద్ద)

అయ్యో !

ఒకనాడు రాత్రివేళ నేను వేణుగోపాలస్వామివారి యాలయములో భామకలాపము చెప్పుచుండగా చూచి మోహించిన భోగేశ్వరుడుగారు తరువాత మా యింటికివచ్చి నిర్బంధించి నాయొప్పుదలకై యేబది వేలొక్కసారి నా గుమ్మమున కుమ్మరించినారు. ఎంత సంసారములైననేమి చెడుట యెంతసేపు. తరువాత వారి సద్గుణములు పురమున నాల్గు ప్రక్కల ప్రతిధ్వనించ సజ్జనుల ద్రవ్యము పదిమంది బీదవారల కుపయోగించునది యిట్లు హరించరాదను తలంపు దైవయోగ

మున నాకు గలిగినది. వారిన తీసుకొని వెళ్లుడని బ్రతిమాలి తిని. ఫలితము లేకపోయెను. వారిపెద్దలకొరకు విచారించితిని. ఎవరునూ లేరని తెలియవచ్చెను. మీరు వారిమిత్రులని, సచ్ఛీలు రని తెలిసి తాము మా యిండ్లకురారని తెలిసి నా వంటి కులటలు తమ యింటికి వచ్చుటకు తమ రంగీకరింపరేమో యను భయంబున భోగేశ్వరునిగారి యెదుటనే యా పైకము తమపరముగా రేపు సాయంతనమున శ్రీ వేణుగోపాలస్వామి వారి యూరివెలుపలి యుద్యాన వనమున నిచ్చుటకు నిశ్చ యించుకొంటిని. తమరు యథాభవదిష్టముగా బ్రవర్తింతురు గాతమని నాకోర్కి.

చిత్తగించవలెను,

నగరాజుకుమారి చెల్లెలు చిత్రలతవ్రాలు

రత్న:- ఓయీ! (తలయెత్తి) వీడేడీ! ఇదేమి, చిత్రముగ నున్నదే! బోగముదా! చేతజిక్కిన ధనము వదలి పెట్టునా! ఇదియేమో యింద్రజాలము. జాతి నీచమైన సద్గుణముండరాదా! ఏమో!

వేము తీయనగుట విష మమృతంబౌట
వారకాంత రోయి వదలుకొనుట
కనులయెదుట చూడగానౌనా! పడమటి
కొండ నినుడు తోచకుండు నోక్కా

(తెర)

చిత్ర:- (పరివే) రెండెత్తులున్నవి, ఏది సాగింతును. రత్నగిరి నా పన్నుదల కభ్యంతరము. నా యుత్తరమనిన తోడనే నిరాదరణ. అట్టివాడు శృంగారపు మాటల

కుబుకడు. ఇదియొకటి మంచిదే. ఉచ్చునుండి యిప్పుడు తప్పించుకొనలేడు. నమ్మినా? నమ్మిననేమి, నమ్మకున్ననేమి? భోగేశ్వరా! ఇన్ని హత్యలతో పాటు శిశు హత్యకూడనా! ఘోరము...ధీరులు విఘ్ననిహన్యమానులై ప్రారబ్ధార్థము లుజ్జగింపరు. కంకటు డుత్తరము దిగవిడిచి వచ్చినాడు. రేపు కంకటుడు బైరాగివేషము మరల వేయునుగాక. తాతా!

కంక:- ఏమే! నిదురపోనియ్యవు. నీకేమి? మడకట్టైవలె పడుచుతనముచే మిట్టిపడుచున్నావు. నా ముసలికళ్లు మూతపడుచున్నవి.

చిత్ర:- నాల్గునాళ్ళనుండి మనయింటికి నీతో మాట్లాడుటకు కాసిము వచ్చుటలేదేమి?

కంక:- ఎందుకు? వానిమీదపోయినదేమి?

చిత్ర:- నాకు వానితో పనియున్నది.

కంక:- మీ అక్కవలె ఖూనీలు చేయింతువా ఏమి?

చిత్ర:- రామ! రామ! తాతా! నీవు నన్నెఱుగవా! వానితో మొన్న నొకమాట చెప్పితిని. నీవు వానినిప్పుడు తక్షణము తీసుకురావలెను.

కంక:- నే నిప్పుడు పోలేను.

చిత్ర:- అయిన నీ యర్ధరాత్రమున నే నొంటరిగ పోయెదను.

కంక:- అమ్మా! చీకటిలో నడువలేనే.

చిత్ర:- నేను వెళ్లెదను కాదా!

కంక:- దానిదుంపతెగ, నేనే వెళ్లెదనులెమ్ము.

( చిత్ర — నిష్క్రమించును )

కంక:- ఇది యేదియో త్రవ్వుచున్నది. భోగేశ్వరుని గురించి యని నాకనుమానముగా నున్నది.

(నిష్క్రమణం)

భోగేశ్వరుని గృహము.
తెరలో

పతి కృపాపాంగ రేఖలు పడతిపైన
యెపుడు జల్లుగ కురియునో యపుడె ముగుద
పూర్వమున చేసికొన్న నోములు ఫలించు
నదియె తరుణికి స్వర్గసౌఖ్యావహమ్ము.

( ఇది చూళిక )

( అధోముఖి భాగీరథి - రూక్షవీక్షణుడు భోగేశ్వరుడు ప్రవేశము )

భాగీ:- నాయందు తమకింత యనుమానమునకు నా దౌర్భాగ్యమే కారణము.

భోగే:- కాదు కాదు. నీయందు నాకుగల మహాప్రేమ.

భాగీ:- అది నాకుగల మహాభాగ్యములలో మొదటిది.

భోగే:- రెండవది?

భాగీ:- మనకూన రాజేశ్వరియందు నా ప్రేమ

భోగే:- మాట తప్పించుటలో స్త్రీలు నెఱజాణలు.

దేని కనులార చూతుమో దానియందు
పరగచేతు రదృశ్యభావంబు సతులు
దేని చెవులార విందుమో దానియందు
ప్రబలచేతు రశ్రవ్యభావం బతివలు.

పశ్యతోహరు లగసాలివారు కారు, స్త్రీలు.

భాగీ:- నా కర్మము. నా దౌర్భాగ్యమునచేసి నా పలుకు

యథార్థ వచనములుకూడ మృషలే యగుచున్నవి.

భోగే:- ఓయబ్బ! మిక్కిలి ముద్దరాలవే; ఓసీ! ఇదంతయు నెందులకు? నీకెవండు ప్రియుడో వాని ననుసరించుము. లోకముతో లెక్కయేమి?

భాగీ:- స్వామీ! ఈ దీనురాలియందు తమకు నిష్టము తప్పెరా! ఇది మీ హస్తగత. దీని తమరు తమ క్రోధ దేవతకు బలి యీవచ్చును. నిష్ఠురములు, నశ్రవ్యములగు వచనములతోనేమి పని?

భోగే:- అవును; నాకు మాటలతో పనిలేదు. నీవు నా యిల్లు విడచి యవతలకు నడువుము.

ఎవడు నీ కన్నుకాటుక యెవడు నీకు
వాలుజడలోని కుసుమ మెవ్వాడు నీకు
కంటిపాప యవ్వానితో కలయబొమ్ము
మనసు చూరబోని తగులము మాటయేల?

మెలత! నీమేని కనకంబు మేలి మూఁద
దిన దినము మన్మథాగ్ని నుద్దీప్తిసేతు
దుష్ట నరపతి నాణెముతో సమాన
మై యితరలోహ మేళనమందె నదియు.

సీ! యింక నీ పాదములచేత మహానుభావులగు నా పితరులు నిర్మించిన యీ పుణ్యావసథము నపవిత్రము చేయకుము. తక్షణము లేచిపొమ్ము. (తన్నును)

భాగీ:- అయ్యో! ఎక్కడకు బోదును (రోదనము)

భోగే:- ఎక్కడకు బోయెదవు. ఎక్కడకు బోయెదనని యిట్లు. చేసితివో అక్కడకే పొమ్ము.

భాగీ:- (ఊరకుండును.)

భోగే:- ఏల నిలచెదవు? కృష్ణవేణీగర్భమున ప్రవేశింపుము.

భాగీ:- (తనలో) అట్లనే చేసెదను. అమ్మా! కృష్ణవేణీ! ఈ దీనురాలి నితరంగములలో లీనము చేసుకొందువా! అమ్మా! రాజేశ్వరీ! పసిపిల్లవు. నిన్ను వదలిపెట్టి యెట్లుపోగలనే తల్లీ! (ప్రకా) స్వామీ! నమస్కారము. మిమ్మొకసారి మనోహరా యని పిలువ బుద్ధిమాత్రమున్నది. గాని యీ పాంసుల మిమ్మట్లెల పిలువవలయును. నిజముగా నీ గృహము నాచేత కలుషితమే చేయబడినది. (రోదనము)

భోగే:- (తనలో) అక్కటా! నిన్నెంత కష్టపెట్టుచుంటిని. భాగీరథీ! భాగీరథీ! త్రయీ పాఠకులును, యాజ్ఞవల్క్య ప్రతిమానులు నగు నా పితరులు నిర్మించిన యీ గృహము నీచేతగాదు, నాచేత నపవిత్రీ భూతమగుచున్నది.

భాగీ:- అయ్యా! నేను సెలవు తీసికొందును. నా నీడయేని మీ ముంగిట తగులనీను. భవదాజ్ఞాబద్ధనై దక్షిణ గంగ శ్రీ కృష్ణవేణీ గర్భగోళమున నంతరించిపోదును కాని రాజేశ్వరి పసిపిల్ల. సవతితల్లిచే యీసడింపులకు గురిసేయకుడు. నే చెప్పనవసరములేదు. కాని నా కడుపుకోత చెప్పించుచున్నది. ఏమట్లు దుఃఖించెదరు. నావలన నీ వంగడము కళంకితమైనదనియా? అది నాతో తుడుచుకొని పోవును లెండు.

ఆ కూనంగని శాంతి పొందుడు విలాసానందహా మీా మనం
బేకాంతామణిచేత నీ విధముగా హీనస్థితిం బొందెనో
శోకం బావృతమయ్యె నీపిత గతాసుండైన రోజుంబలెన్
మీా కంఠం బతిశోకరుద్ధమయి పేర్మిం బాసె నేడేలొకో

అయ్యో ! నాశోపు నీమాత్రపు నీ కళంకమునకు మీారింత వగవ జనదు. నా దుర్మరణమునకు నా కంతవగపు లేదు. గాని మిమ్మిట్టి స్థితిలో చూడజాలకున్నాను. కానిండు! నా దొకటియే ప్రార్థన. నా చనిపోయిన తరువాతనయిన భాగీరథీ పావిత్ర్యము తమకు గోచరించుగాక. తమ కీయను మానమును కూడనిదికాదు. భర్తకు భార్యయందు ప్రేమ చేతనే యిట్టివి కలుగును. ఆ యనుమానమును, ప్రేమవలననే గలుగుట చేసియే పతివ్రతకు నది కష్టముకాదు. నేను సెలవు తీసికొందును. రాజేశ్వరిని రక్షించుకొనుడు. (నమస్కరింప బోవును.)

భోగే:- (లేవదీసి) ముద్దరాలా ! భాగీరథీ ఎవరైన సుఖ పెట్టినవారిని గౌరవింతురుబో, కష్టపెట్టినవారి నను నయింతురా ! ప్రేయసీ ! అనవసరమ్ముగా నిన్ను శోషిల్లజేసితి. నిజము కనుగొనుటకు నిన్నిట్లు పరీ క్షించితిని గాని నిన్ను నేను వదలి నిముసము బ్రదుక గలనా.

నీవు నా పాలి పరమభాగ్యలక్ష్మివి. నా చేయు నీ వ్యయమునకు నా భాగ్య మక్షయముగా నుంటకు నీ భాగ్య రేఖయే ప్రధానము. దేవీ ! కన్నులెత్తి నావంక చూడుము. అయ్యో ! ఏడువకుము. (అని కన్నీరు తుడుచును)

తప్పుచేసితి నీయందు తరుణి! మూఢ
చిత్తుడను నేను శోకించవెల్ల దీవు
పతి ప్రసన్నుడైనాడు నా వంక తెప్ప
లెత్తి కనుగొమ్ము క్షమియింపు మింక నన్ను.

భాగీ:- ఆర్యా! మీరనిరని నాకు దిగులులేదు. కాని యిట్టి స్థితి ఘటించచేసిన నా దురదృష్టమే నింద్యము. ఇంత మాత్రముచేత నాకు మీ యందు కోపముగాని యీర్ష్యగాని లేదు. మరల తాము ప్రసన్నులై నారలంతియే చాలును.

నాకు మీ కంటిబొమముడి నాథ! కాలకూట
విషవహ్ని, మీ నవ్వు కోమలమధు
మాససహకారపుష్పవికాస మనఘ
అమృత ఝరి మీదు మందహాసాంకురమ్ము.

భోగే: - ప్రేయసీ! ఇది మరచి పొమ్ము. నన్ను క్షమింపుము.
మ్రోగుచున్నది దూరాన మువ్వరీతి
కుసుమశరబాణటంక్రియావిసర మదిగో
అమృతశీతలమలయానిలములు నీక
టాక్షములతోడ లీనమై యరుగుదెంచె
(కౌగిలింత)

భాగీ: - అమ్మాయి రాజేశ్వరి యేడ్చుచున్నది. ఓదార్చి వచ్చెదను. (నిష్క్రమి)

భోగే: - భార్య కరుణాప్రసార సంభావితుండు
పితరుల కృపాంబువులను దీవించ బడును

సుగుణఖనియైన యిల్లాలిచూచి ముదము
పడయుజను నింట గాపుండు భాగ్యలక్ష్మి

భాగీరథి (ప్రవేశించి) ఏమాలోచించుచున్నారు.

భోగే :- నీవు చిత్రలత నెఱుగుదువా ?

భాగీ :- ఆమె పేరు చిత్రలతయా యేమి ?

భోగే :- అవును.

భాగీ :- ఎఱుగను.

భోగే :- అది చాల సుగుణాలవల్లి. అది నిన్ను చూడవలె ననుచున్నది. రేపెప్పుడైన కబురంపెదను వచ్చెదవా ?

భాగీ :- చిత్తము

(తెరలో)

భావి దుర్దశా వృక్షమ్ము పట్టిటింగి
వేళ్ళు పాతుకు పెద్దదై వీధులెల్ల
వ్యాప్తమగుటకు నింతలోపలనె యాత్మ
హంతచే నాటబడినది యంకురమ్ము.

భాగీ :- ఆ ధ్వని యేమి ?

భోగే :- దొడ్డిలోని కొబ్బరిమట్ట పడినదేమో మనము పోదము పద.

అదిగో ! వినవచ్చుచున్నది యసమశరుడు
పూలతూపులు జోడించి పుంఖములుగ
వదలుచున్నాడు గండు తుమ్మెదలనారి
మ్రోగుచున్నది సంగీత మోహనముగ

(తెర వ్రాలును)

# ధన్యకైలాసము



## చతుర్థాంకము

(ప్రవేశము - చిత్రలత)

కంకటా! ఇంకొకజాము ప్రొద్దున్నదా! మేడపై నిదురపోవుచున్న భోగేశ్వరుని లేపుకొని రమ్ము.

భాగీరథీ! నేటితో నీ పావిత్ర్యము చెడగొట్టి నిన్ను కలుషాంకిత జేసెదను. కంకటా! లేవనే లేదా! అడుగ మఱచితిని. రత్నగిరి వద్దనుండి యుత్తరము తెచ్చితివా! నీవు బండి కట్టుకొనిపోయి చిత్రలతతో గలిసి భోగేశ్వరుడుగారు నగరము వెలి గోపాలస్వామివారి మామిడితోటలో వసంత కాలమగుటచేత నిండుగా పూచిన మావిగున్నలక్రింద వాహ్యాళిపోవుచున్నారు. మిమ్ము తీసుకురమ్మనినారని చెప్పి భాగీరథిని బండియెక్కించుకొనిరావలయును. భోగేశ్వరుడుగారు తమపిల్లను రత్నగిరి తల్లి కప్పజెప్పిరమ్మనినారు. అది యామెతో చెప్పి యట్లు చేయించుము (శ్రుతి) ఏమందువు; భోగేశ్వరుని నిద్రమేల్కొలుపవలదా యందువా? నీవుపొమ్ము వలదులే. పరభృతిక లేపును లెమ్ము, వెళ్ళితివా; సరి. పరభృతికా! భోగేశ్వరుడుగారిని నిద్రలేపుము (శ్రుతి) ఏమనుచున్నావు. నిద్రలేచెననియా! వచ్చుచున్నారా! నేను నిదురపోవుచుంటినని యాయనతో చెప్పుము. నాగదిలోని కభ్యంతరము లేకుండ రానిమ్ము.

(పరుండి నిద్రాభినయము)

భోగే :- (ప్రవేశించును.)

భిక్షు :- (ప్రవేశించును.)

మోసపోయెదవేమొ చిలుకా
ఆస దాటితివేని ఆనందములకా !
మెఱయనూ మెఱవదు మెఱసినట్లేయుండి
మెఱపులో చీకట్లు తరుముకొనివచ్చునే ॥మోస॥
తెలియనూ తెలియదూ తెలిసినట్లేయుండి
తెలివిలో నజ్ఞాన తిమిరమ్ము గ్రమ్మునే ॥మోస॥

భోగే :- (తనలో) ఇత డిక్కడ నెట్లున్నాడు. (ప్రకా) భిక్షుకుడా ! ఇచ్చటి కెట్లువచ్చితివి ?

భిక్షు :- నీ వెంటనే వచ్చితిని.

భోగే :- నేను మేడపైనుండి వచ్చితిని. నీవందుంటివా!

భిక్షు :- ఎందుకులేను.

భోగే :- (అటుతిరిగి) చిత్రలతా ! (భిక్షు-నిష్క్రా) (వెనుకకు తిరిగి) భిక్షుకా ! ఓహో ! భిక్షుకుడేడీ ! వెళ్లినాడా !

చిత్ర :- (కలవరించును)

భోగే :- ఈ కాంత యేదియో నిద్రలో ననుచున్నది.

చిత్ర :- భోగేశ్వరా ! నేను దాచుకొన్న యీ ప్రేమయను వస్తు వింతబలవంతముగా నేటికి దొంగిలించెదవు.

భోగే :- (సమీపించి-నవ్వుచు) చిత్రలతా ! చిత్రలత ! (తట్టి లేపును)

చిత్ర :- (ఉలికిపడిలేచి) ఆర్యా! మన్నింపుము. తమ రిచ్చటి కెప్పుడరుదెంచినారు. (వి సుగుతో) పరభృతికా !

ఆర్యులు వచ్చుచున్నారని నాతో చెప్పవలదా !
భోగే :- (నవ్వుచు) ఏమి మునిగిపోయినది. ఎందు కింత యలజడి.
చిత్ర :- క్షమించుడు.
భోగే :- నీవేమి తప్పు జేసితివి. చేసితివో ! ఈ తప్పు కతము ననే నా చెవులు సాఫల్యము నొందుమాటలు విన గలిగితిని.
చిత్ర :- ఏమని.
భోగే :- చెప్పుమందువా !
చిత్ర :- చిత్తము.
భోగే:- నీవు నిద్రలో కలువరించితివి. "భోగేశ్వరా ! నేను దాచుకొన్న యీ ప్రేమయనువస్తువు ఇంత బలవంతముగా నేల దొంగిలించెదవు" అని
చిత్ర:- (తలవొంచి లజ్జాభినయము)
భోగే:- ప్రేయసీ! తలయెత్తుము.

తరుణి నీ సిగ్గు తుంపురుల్ పరచిపరచి
మదనభూపతి రణభేరి మారుమ్రోగ
దెంతబలహీనుడైనాడె యింతి నీ మ
నస్స్వభావముచేత మన్మథుడు నేడు.

(చుంబనము)

చిత్ర :- మనము నేడు వేణుగోపాలస్వామివారి మామిడి తోటకు వాహ్యాళిపోదమా ! వసంతకాలపు నవకము పొందిన మావిగున్నలు కోకిలలకు మేతలు పెట్టును. మనము చూడవచ్చును. పరభృతికా ! దుర్మతితో

చెప్పుము; నేను నేడు కొంచెము ప్రొద్దుపోయి కాని రానని. (నిష్క్రమించును.)

( ప్రవేశము - రత్నగిరి )

ఇదియే శమీవృక్షము. (ప్రదక్షిణముచేసి నమస్కరించును.) వేణుగోపాలస్వామి పాటు వేటకు వచ్చు నీ యుద్యానవనముచూచిననే నాకు భగవంతుని జూచినట్లున్నది. హే జగన్నాధా!

రవిసుతా నిర్మలాంబుపూరములమీది
శీతగాలుల యులివుతో లీనమగుచు
నీ మనోహర గాన లీలామృతంబు
తడుపుచున్నది రమ్య బృందావనంబు.
రమ్య బృందావనీ తరుప్రాంతభూమి
కోమలాంగుళులను పిల్లగ్రోవి మెలిపి
అమృతరసమయలోకకళ్యాణగీతి
పాడుచున్నాడు బాలగోపాలమౌళి.

నా కా నాదబ్రహ్మములో నెప్పుడెప్పు డైక్యమై పోదునా యనియున్నది. కాని నా ముదుసలి తల్లి నాకు ప్రతిబంధకముగా నున్నది. (ఎదుటజూచి) చిత్రలత గాని యెవ్వరుగాని యిందు లేరే! (అక్షిస్పందనము) ఇదియేమి యశుభము! మా భోగేశ్వరుడు గారేదియో మహాపదలో నే చిక్కుకున్నాడు. లేకపోయిన నీ యుత్తరమేమి? అయిన నది యింతవరకు రాకుండుటకు కారణము!

(నిష్క్రమణ)

( ప్రవేశము - చిత్రలతా, భోగేశ్వరులు)

భోగే :- ప్రొద్దుగ్రుంకినది ఇంక పోదమా !

చిత్ర :- కొంచెమాగి పోదము.

భోగే :- నీవేమొ నవ్వుచున్నట్లున్నది. చిత్రలతా! నీవేదియో యీనాడు క్రొత్తరీతిగా నుంటివి.

చిత్ర :- ఏమియును లేదు.

భోగే :- అట్లుకాదు చెప్పవా ! నామీద నొట్టు.

చిత్ర :- చెప్పుటకేమున్నది. నిజ మొకరీతిగా నుండ మనుజులకు నమ్మక మొకరీతిగా నుండును.

భోగే :- నీ మాటలు నా కర్థమగుటలేదు.

చిత్ర :- నేడు ఈవేళకు ఇచ్చోట నిరువురు సమాగమమాడురను వార్త నాకు వచ్చినది.

భోగే : అది నాకు ప్రత్యక్షమైనది.

చిత్ర :- ఎట్లు ?

భోగే :- నీవు, నేనును.

చిత్ర :- అదికాదు; అది యింతనవ్వుగా పోవలసినదికాదు.

భోగే :- నా హృదయము కంపించుచున్నది. ఏదియో తొందరగ చెప్పుము.

చిత్ర :- చూపించెదను రండు. (ఇరువురు నిష్క్ర-)

(ప్రవేశము రత్నగిరి)

తోట నాల్గుమూలలు వెదికితిని; ఎవ్వరును కానరారు; (ఎదుట) ఆ వచ్చుచున్నది యెవరు ? భాగీరథియా ?

( భాగీరథి - ప్రవేశము )

రత్న :- అక్కా ! ఇదియేమి ! నీవిట్లు వచ్చితివి.

భాగీ :- నీ బావగారు తమ యుంపుడు కత్తెయగు చిత్రలతతో నీ వనంబునకు వత్తురట;అది; నన్ను చూడవలెనన్నదట; కబురంపినారు; వచ్చితిని.

రత్న :- నీ వొక్కతెవేనా! రాజేశ్వరి నేమిచేసి వచ్చితివి.

భాగీ :- అమ్మదగ్గర దిగవిడచి రమ్మని కబురంపినారు.

రత్న :- నిన్నెవరు తీసికొని వచ్చిరి.

భాగీ :- కంకటుడను చిత్రలత సేవకునిచే బండితోలి పంపించినారు.

రత్న :- వాడేడి !

భాగీ :- తోటవెలుపల బండితో నున్నాడు.

రత్న :- చిత్రలతిక నాకొక యుత్తరము వ్రాసినది. (అని యుత్తర మిచ్చును)

భాగీ :- (చదివి) తమ్ముడా! యిది వన్నెగడగానున్నది. రెండువత్సరముల నుండి యెఱుగుదును. రాగలతిక యిట్టి యుత్తరములు గాని, కబురులుగాని యేదియు నెరుగదు. చిత్రలత వారము రోజుల క్రిందనే గదా వచ్చినది ! ఇన్ని చిత్రములేమి ? చెప్పిన నమ్ముదువో నమ్మవోకాని, ఈ వారము దినములనుండి మీా బావగారివలన నా పడు కష్టములు భగంతునకే యెరుక.

రత్న :- ఏమని !

భాగీ :- (తలవంచుకొని) ఏమని చెప్పుదును.

రత్న :- ఏమున్నది ? చెప్పుము.

భాగీ :- మీా బావగారి కనుమానము.

రత్న :- ఏమని ?

భాగీ :- నిన్నును - నన్నును గురించి

రత్న :- హరిహరీ ! (కన్నీళ్లు) అమ్మా! ఇట్టి మాటలు విని యేమని బ్రదుకగలను. పసితనమ్మున నా కడుపునకు పైచిన యామదమువద్దనుండి భోగేశ్వరుని సొమ్ము కదా ! అట్టి మహానుభావుని యిల్లాలా ! నేనా ! దైవమా ! ఇంతకన్న మాతృహత్యయు పితృహత్యయు మంచివే ! (రోదనము)

భాగీ :- నాయనా ! దుఃఖించకుము. నేను నీకు సోదరికన్న నెక్కువ దాననని యెరుగుదును. అది యాయనయు నెరుగును, కాని యధర్మప్రవర్తనవలన విజ్ఞానము నశించినది. ముందిదిచూడుము. ఈ యుత్తరము వలన నిన్నిచటికి రప్పించుట, నన్ను తీసుకొని వచ్చుట, వారు రాకపోవుట.

రత్న :- (ఆలోచించి) అక్కా ! కాని వారుగూడ రహస్యముగా వచ్చియే యుండవలయును. వారిని వెదకుదము రమ్ము. (ఇద్దరు నిష్క్రమింతురు)

(రెండవ వైపునుండి - చిత్రలతా భోగేశ్వరులు)

భోగే :- వీరి నిప్పుడేమి సేయవలయును?

చిత్ర :- మనస్సునకు వక్రత్వముస్వభావము. కావున క్షమించ తగినది.

భోగే :- క్షమించుటయా !

ఈ యొడల్ భగ్గుమని నిలువెల్ల మండి
పోవుచున్నది మిగుల ; పూబోడి ! నాల్క

పిడచ కట్టుచునున్నది; పిండివైతు
పాంసులారక్తమును కళేబరమునుండి.

చిత్రలతా! నన్నాపకుము. నే నిప్పుడు కాలకూటాగ్నిలో స్నానము చేయుచున్నాను. ఛీ! ఛీ! కొఱతలేని సంసారము. అట్టి ప్రవర్తన; ఇంక పురుషుడేల పెండ్లియాడవలె? నాకు దేహాము పొంగిపోవుచున్నది.

చిత్ర :- (తనలో) ఇప్పు డితని నెమ్మదిగా నింటికి చేర్చవలయును. తరువాత రాగలతికా సమాచారము నితనికి దెలిపెదను. అప్పుడు మానిసి యెట్లుండునో చూడవలయును.

భోగే :- కాకులున్ గృధ్రములును నాకసమునందు
మూగుచున్నవి. జంబుకములు వనంపు
టెల్లలందున కూసెడు నెలుగుటెత్తి
ప్రబలముగ పేర్చి యశుభరావమ్ము లొసగ.

చిత్ర :- (తనలో) అెవరో వచ్చుచున్నట్లున్నారు. వారి రువురే! ఇంక నీయనను తీసుకొని పోవలయును. (అని బలవంతముగా భోగేశ్వరుని తీసుకొని పోవుచున్నది.)

(రత్నగిరియు, భాగీరధియు ప్రవేశింతురు)

భాగీ :- నాయనా! వారిందెవరును కన్పించరేమి?

రత్న :- ఇది యేదియో మహా చిత్రముగ నున్నది. నీవు మరల కంకటుని బండి యెక్కి యింటికిపొమ్ము. నేను కొంచెము విచారించి వచ్చెదను.

భాగీ :- నీ వొంటరిగ నిందుండజనదు. రమ్ము కలసియే పోదము.

రత్న :- సోదరీ ! నాకా భయములేదు. (కత్తిదూసి)

కాలభటకంఠగోశరక్తప్రవాహా
క్రమధారాపగాతిరస్కారిణి, దీని
కనుగొని ప్రశాంత హృదయునై కదలుమింక
భయములేదమ్మ నాకు సౌభాగ్యవల్లి.

(భాగీరథిని పంపించి వెనుకకు మరలును.)

రత్న :- ఇప్పుడు నే నొంటరిగా నుంటినని యది సంకేత స్థానమున యందె యుండెనేని తెలిసికొనుగదా ! నాకపాయము చేయ నిశ్చయించెనా, ఇంక రావలయును కాదా ! సంకేత స్థానమునుండి బయటికి రావలయును గదా ! నేను తెల్లవార లింద యుండి తోట నాలుగు వైపుల చూచుచుండెదను. ఎట్లు తప్పించుకొని పోగలదో ? (ఆలోచించి) కారణాంతరములచేత నది చెప్పినట్లు వచ్చుటకే వీలుపడలేదా ! మానిని జాడ కనబడదు.

(తెరలో) ఓయి ! రత్నగిరి ! ఇటులరావోయి! యిట్లురమ్ము.

పిలుచుచున్నది నిను గలగలమనుచును
యమమహారాజ మహిష కంఠాగ్రసీమ
మెలగు ఘంటారవమ్ము కామించివచ్చె
మృత్యుదేవత మిగుల పేర్మి చనుదెమ్ము.

రత్న :- ఎవరురా! తులువలు మీరు? (తనలో) ఇంతయవు

నని నాకు తెలియును. కానిమ్ము, దైవమెట్లుండునో! నేను వీరి చేతిలోబడి మడసితినా! భోగేశ్వరుని ఋణ మెట్లు తీర్చుకొందును? (ఆలోచించి) ఇప్పటికి స్పష్ట మైనది. ప్రస్తుత మిది నానెత్తికివచ్చినను తుదకు భోగేశ్వరునిమీాద నొఱగునదియే. నే గతియింతునేని భగవంతుడా! ఒకటియే ప్రార్థన.

పూని పన్నెను కత్తులబోనొకండు
మేచితా చిత్రలతిక భోగేశ్వరుని కు
టుంబమంతయు నందు గండు పులివోలె
పాదివి పైబడి కొరికి చంపుటకుగాను.

ఈ గండము నీచేత నగునేని తప్పించుము.

(తెరలో) ఓరీ! రమ్ము! రమ్ము!

"తిథి యముని యింట నేడు బంధింపబడియె
యమ మహిష చక్రవర్తి పిండములు తినగ
మంత్రములు చెప్ప మృత్యువు మఱగివచ్చె
కాలుని గృహాంగణమున భోక్తవుగ రమ్ము"

రత్న :- ఓరీ! నాచేతిలో నున్న యీ కరవాలమును చూచితివిరా!

(తెరలో) చూచితిమి. నీవింతవాడవని తెలియును గూడ! అన్నింటికి సిద్ధమయే వచ్చితిమి!

(రత్నగిరి నిష్క్ర).

తెర:- ఇది చతుర్థాంకము.

# ధన్యకైలాసము



## పంచమాంకము:

(భోగేశ్వరుని ఇల్లు- ప్రవే- రత్నగిరి తల్లి-భాగీరథి)

తల్లి:- తండ్రీ! నా యీ ముసలితనమున నెంత కడుపుకోత తెచ్చితివిరా! (రోదనము)

భాగీ:- అమ్మా! సేదదేఱుము నీ కొడుకును పెంచి పెద్దవానిని చేసినది భోగేశ్వరుడే?

తల్లి:- తల్లీ! ఎంతకారణమైన నుండనిమ్ము పెంచిన మమత యైన నుండదా! భోగేశ్వరునకు. ఇట్టి పాపమతడు చేసెనని నేను విశ్వసించలేను.

భాగీ:- చిత్రలతా! చిత్రలతా! నీకును రాగలతికకును చాల భేదము గలదు. రాగలత రాగలతయు, నీవు చిత్ర లతవును. రాగలత మనోహరుని ప్రేమించినది. నిన్ను మనోహరుడు ప్రేమించినాడు.

తల్లి:- అమ్మా! నేనింకిందుండలేను, నాకిందేమున్నది. ఈ యూరు వదలిపోయెదను. నాకు సెలవిప్పింపుము.

భాగీ: నన్నెవ్వరికప్పజెప్పిపోయెదవు. నన్నుగూడ రత్నగిరితో బాటు చేసెదవా! నేనదియే యెదురు చూచు చున్నాను. అప్పుడునీ శిశువును రాజేశ్వరిని రక్షించ వలసియుందువు. నా పుట్టినింటివారిచ్చిన యాస్తియం తయు నీ పేర వ్రాసెదను. ఈ పిల్లను తగినవానిచేతిలో

పెట్టునంతవరకు నీ కిదితప్పదు. ఇప్పుడు చూచుకొను నూయియో గోయియో అప్పుగే చూచుకొందువు కాని. నా కొక్కటే భయము; అట్లుకాకపోయిన నిది బోగమువాండ్లచే పెంపబడి నీచవృత్తినవలంబింప వలసివచ్చునేమో? తల్లీ! నన్ను నీ కడుపులో దాచు కొనుము. (కౌగిలించుకొని యేడ్చును.)

తల్లి:- అమ్మా ఏడువకుము-ఏడువకుము. చెట్టంత కొడుకును చంపుకొనిగూడ నీ రాజేశ్వరికై బ్రతికియుందును. అమ్మా! ఎట్టివేళ జన్మించితివే!

భాగీ:- అక్కటా!

నిండుగా పూచి కన్నులపండువగుచు
తీగలల్లిన సంపంగితీవ పూల
గుత్తితోగూడ బోయడుగొడ్డలంట
నరకుచున్నాడు విజ్ఞానసరణిమాని.

( తెర )

భోగే:- (పవే) రాగలతిక సిరిపురమునకు మేళమునకు పోయి కలరాతగిలి చనిపోయెనట. రత్నగిరి దొంగలచేత కొట్టబడిచంపబడినాడట. ఇవి రెండును విపాద కార ణము కాదా! ఏమో? భాగీరథీ! ఛీ! ఛీ! ఎంతయ పవిత్రమైనమాట నోటవచ్చినది. (నిశ్వాసమువిడిచి) నా మన స్మారక వేదన పొందుగాని యొక్క భావ మ్మునకేని యెడమీయుటలేదు. (ఆగి) నా రితతకార ణములచేత నచ్చుట సమావేశమైరేమొ! ఏమి కారణ ములు వచ్చినవి! మూలచ్ఛేదము గావింపబడియు

మరల మరల తల యెత్తుచున్నది. ఎంతదారుణము;
(నిట్టూర్పు విడిచి-సరుదితము) ఈసారి నిట్టూర్పుతో
నా గుండెలు పగిలిపోవునేమొ!

( తెరలో )

ఎరుగవూ! తత్వమెరుగవూ
వ్యామోహ మతివై
తెలియవూ తత్వము తెలియవూ.

భోగే:- ఇతడల్లనాటి భిక్షుకుడువలె నున్నాడు. ఇతనిపాటల
యందు నాకు నూతనార్థములు స్ఫురించుచున్నవి.
ఆ రోజున నావద్ద నుత్తరీయము తీసికొనినప్పటినుండి
నప్పుడప్పుడు నన్ను చూచుచునేయున్నాడు. చూచి
నప్పుడెల్ల నిట్టితత్వములే పాడుచుండును. ఎప్పుడును
ఇట్లే పాడునేమో. ఓయి! భిక్షుకుడా! ఇటురమ్ము.
(భిక్షుకుడు ప్రవేశించును).

భోగే:- నీవు పాడుచున్న తత్వము పాడుము.

ఎరుగవూ తత్వమెరుగవూ
వ్యామోహమతివై
తెలియవూ తత్వము తెలియవూ.

పామరుల మాటలనువినెదవు - పాపకూపమునందు పడెదవు
కోమలులకనుగొనలు పెనువిష - కూటములు మోహానము
లందువు "ఎరుగవూ"
తెలివిలే నజ్ఞానజనముల - పలుకులన్ను విని మోసపోదువు
తెలిసినట్టి మహానుభావుల - వలన సుంత యెరుంగజాలవు
"తెలియవూ"

భోగే:- ఓయీ! నీవెన్నియోసారులు నా వద్దకు వచ్చెదవు. కారణమేమి? నా వద్ద నేమియులేదు. సాయంతనము నీవు-భోగమువాడలో చిట్టచివరమిద్దె యున్నది. చిత్రలతయను భోగముదానిది. అచ్చటికిరమ్ము. ఏదియైన నిప్పించెదను. (అటు తిరిగి) దీని యర్థమేమి? ఆహా! ఇప్పుడేమి చేయుదును- (భిక్షు - నిష్క్ర-)

భోగే:- (రోదనముతో) నీ కడుపునబుట్టిన మగబిడ్డ నన్నును, నా పితృదేవతలను తరింపజేయుననుకొంటిని. నీ రక్తముతోనా! వారికి తర్పణము. ఇదియొక మహాప్రళయాగ్ని నాలోవచ్చి ప్రవేశించినది. ఏదీ! మనశ్శాంతి! భిక్షుకా! మనశ్శాంతి. (చూచి) ఏడీ, భిక్షుకుడు!

( ప్రవేశము - మృత్యుదేవత )

పాణులకు దాటరానిది యమునియాజ్ఞ
మృత్యుదేవతావదన దర్వీకరాభ
మైన జిహ్వాగ్రముల నిమ్నగాకృతులయి
రక్తధారలు జాఱు నిరంతరముగ.

మఱియును నాకు,

తానమాడెడుచోట్లు రక్తంపునదులు
ఒడిచి పీల్చుట ప్రాణవాయువులు భోజ
నమ్ము ప్రాణుల మాంస మనంతమైన
శక్తి కెదురెన్న లేదు ముజ్జగములందు.

భక్తులును పాపులును నొక్కపగిదినాదు
వదన గహ్వరముఁ జొఱబాఱుచుంద్రు
రాజులును పేదవా రొక్కయోజ నాదు
దంతసంఘాతమున నల్గి తలగుచుంద్రు

నా వదనగహ్వరము

మిగుల నజ్ఞానులైపోయి జగముజనులు
చూడగాఁజాలరే కాని చూచిరేని
నిఖిలలోకమ్ము లందేకనిష్ఠదాల్చి
తుదిమొదలులేక మెలఁగు నస్తోకఫణితి.

(నిష్క్రమించును)

తరువాత రెండుభూతములు (ప్రవేశించును)

1:- మాంత్రికుని యింటిపేలాలు మఱిగినావు
రావికొమ్మలపైనెక్కి-రావు దిగవు
అల శ్మశానమ్మునందు మహానుభావు
డైన భేతాళమూర్తి నృత్యంబుసేయు

2:- నీ! నీకు మాత్ర మేమితక్కువ
మూడుపొలిమేరలును చేరికూడినట్టి
చోట రక్తాన్నమును భుజించుదువు తంతు
లెన్నియేనియు మాంత్రికులున్న చోట
పొందుదువు మానవులహింస పొంటెనీవు.

1:- ఓసీ! నీవు నాకు లేకుండ
కనగనౌ పసిపిల్లల కంఠములను
పిసికి చంపెదు; భీతలౌ కుసుమబాణ

బాణములవంటి పడతులపై చరింతు
మాంత్రికుల లెక్క చేయ కేమాత్రమైన

2:- ఓసీ! నీ వెన్నియనినను నే నీ రావిచెట్టు దిగిరాను. ఏల చుప్పనాతితనము పడెదవు. నీవుమాత్రమేమి తక్కువ తినుచుంటివి.

కడుపులోనున్న పిల్లలకడుపులోన
నే హరింతువు చూలాండ్ర యేడ్వ లెగయ
పచ్చగానున్న కొంపలపై బడి హరి
యింతు గొడ్లును గోదలు నీతికోలె.

1:- నీవిట్టిదానవు గనుక నే నీ కా వంబలవాడు తగినశాస్తి చేసినాడు.

మొండిమొలతోడ చేత నఖండమొలయు
నూరు నాలుగు కడల రక్తోరుధార
లెగయ నీ వాక్కు తంత్రంబు లెన్నొ చేసి
తుదకు బంధించినాడు సంతోషియగుచు.

2:- ఏడ్చినాడు లే.

తత్సతీసుత బంధుమిత్ర సహితముగ
చావనున్నాడువాడు; మచ్చాటులఘోర
రమ్యదంష్ట్రికరాళభారమ్ముచేత
నొలుకులకు వాని పీనుగ తోలగు రేపు.

(నిష్క్రమించును)

1:- ఛీ! ఇది రాళపోయిననేమి! మొన్న నేను పట్టిచంపిన గొల్లబాలెంతరాలున్నది. అదికూడనిప్పుడు నావలెనే

మారణకృత్యములం దాటితేలినది. అదియును మా బిడాలలోచన పరివార మైదారుగురును, కామినీ మోహినీ గ్రహములతో బయలుదేరి భోగేశ్వరుని యిల్లు చుట్టముట్టవలయును.

పురిటిపాపల మెదడులు పునుక పేరు
లంతమును బొందినట్టి బాలెంతరాండ్రు
పాతిపెట్టిన శేతమోచేతులును వి
భూషణమ్ములు గాగ నే బోదు నటకు.

(సీస. ౮-౨)

(తరువాత వికృతవేషమున భోగేశ్వరుడు) అదిగో! భూతములు బంతులుతీర్చి కూర్చున్నవి. (శ్రుతి) మొలగంట మోత వినవచ్చుచున్నది. మృత్యుదేవత నాట్యమాడు చున్నదికాబోలు ........ ఛీ! ఇదియేమివాసన! ఓహో! గబ్బిలమా! నీ భావి నివాసస్థానము చూచుకొనుటకు వచ్చితి వేమి? అవునవును; చూచుకొమ్ము. ఎచట నీ పెండ్లమును నీవును మాటలాడుదురో! ఏ భాగము నీ కుమార్తెకు అరణ మిత్తువో, ఏది నీ యుయ్యాలలూగుటకు తగిన దూలమో... ఇదియేమి? వాకకాలముగ చలి యెత్తుచున్నది. నన్నే దియో మహాశక్తివచ్చి తాకినది! నా యొడలెల్ల గగుర్పొడుచు చున్నది. (అవలించి) ఇదేమి నా నోట ప్రవేశించిన యీ గాలి యింత చేదుగానున్నది. ఏమి! ఇది విషమిళితమా! ఆహా! నేనిందేల యుంటిని. (స్మృతి)

ఓహో! అందుకనియా! నేను చంపఁబోవునది నా ప్రేయసియైన భాగీరథినా! నేను మా భాగీరథిని చంపుదునా! చంపలేను! చంపలేను! (తిరిగిపోవును) (మరల వెనుకకుతిరిగి) పాప మశిక్షితముగా వదలిపెట్టవలెనా! ఎంత ద్రోహము! ఎంత కృతఘ్నత!

(భాగీరథి–నిద్రావతి ప్ర.)

అదిగో! నా ప్రేయసీ! భాగీరథీ! నా ప్రేమకు నిలకడ! నా ప్రాణము. నిద్రించుచున్న యీ ముఖ సౌందర్యమేమి! యీ సౌందర్యమే నన్నొకనాడు మోహసముద్రములో ముంచినది. (స్మృతి) పసిపిల్ల రాజేశ్వరి యేది! దీని ప్రక్కలేదే! భాగీరథీ!

(భాగీరథి మేల్కొనును)

భాగీ:– (లేచి) ఆయుష్మంతుడా! ఎప్పుడరుదెంచితిరి. ఇందు దయచేయుడు.

భోగే:– ఇల్లు తగులబెట్టుటకు వచ్చిన యగ్నికణము దీపము కానేరదు. నా వేషము చూచితివా!

భాగీ:– చూచితిని. ఇంత పూర్వమే నాకు తెలియును. అందుకనియే సంసిద్ధురాలనైయున్నాను. అన్నిటికన్న చిత్ర మీనాడు నాకు నిదురపట్టినది. మృత్యుదేవత నీ కరమ్మున కరవాలమై నన్ను వరించవచ్చినది.

భోగే:– ఇవి మాటలు కావు! అకాలముగ మేఘగర్జన వినబడుచున్నది. వింటివా! రక్తవర్షము కురియుచున్నది. గుడ్లగూబలు కూయుచున్నవి. శివారవములు వినబడుచున్నవి. రాజేశ్వరి యెందున్నది.

భాగీ:- మీ కత్తికందరానిచోట నున్నది.

భోగే:- అక్కటా! వీడు శిశుహంతయా? విషలిప్తమైన యీ బాకు నా గుండెలో నెంత గాఢముగ నాటితివి.

ఆహా! నా నాభీస్థానమునుండి హృదయమువరకు క్షోభించుచున్నది. ఏమి చేయుదును...... భాగీరథీ! నా కడుపు తరుగుకొనిపోవుచున్నది.

ఒకదానికి నీ యనుమతి యడిగెదను! ఏమందువా? నీవు కనులుమూసుకొనుము. నావంక నటుల జూచెద వేమి! నీ కనులలో నేదోశక్తియున్నది. మహాజ్యోతి యున్నది. ఆ జ్యోతిఃప్రకాశముననే మున్ను ప్రేమ సౌధపు నాలుగుమూలలల విహరించితిని. నే డది ప్రళయకాలాగ్నివలె మ్రింగజూచుచున్నది. ఆ కన్నులొక్కసారి నన్ను ముద్దుపెట్టుకొననిమ్ము. (ముద్దు పెట్టుకొనును)

భాగీ:- ఈ చిత్రమైన ప్రవర్తన నేను పదిలపరచుకొన్న నా గుండె దిటవును చెడగొట్టుచున్నది. ఇది శ్మశానమా! పడకటిల్లా!

భోగే:- (వెకిలినవ్వు) పడకటింట శ్మశానము. శ్మశానమున పడకటిల్లు. అదిగో! వినబడుటలేదా! యమమహిష ఘంటికానాదము.

భాగీ:- వినబడుచున్నది. (తనలో) కాని యితని యీ ప్రవర్తన చూచిన యితడు నా తరువాత పిచ్చియెక్క

తిరుగునట్లున్నది. (పరికా) మనోహరా! నీకు వంశాం కుర మేర్పడ లేదు.

శ్లో గే:- (సరుదితము) ఇంకవంశమా! ఎప్పుడుచిత్రలతా సంగ మార్థమరిగితినో, అపుడే నా కులమందున కాలకూట వహ్ని యుద్భవించినది. ఓ మృత్యుదేవతా! నన్నేల యొక్కసారిగా కబళించవు. నా ప్రాణము లేల నింక నిలచియున్నవి. భాగీరథీ! నేను నీ యెడ నెంతప్రేమ గలవాడనో నీ వెరుగుదువు. నీ తలిదండ్రులు కన్యా దానవేళ నా కప్పచెప్పినదానికి నిన్ను మరల వారి కప్పజెప్పుచున్నాను. నీ కడుపునపుట్టిన బిడ్డ వదల వలసిన జలాంజలికిమారు, నేను రక్తాంజలి వదులు చున్నాను. ఆహా! నన్నొకవైపున ప్రేమ పీడించు చున్నది. ఒకవైపున కృతఘ్నత ననుభవించలేని క్రోధము పెనవేయుచున్నది. (శుతి) ఓదివాంధమా! కూయుము! కూయుము. ఈ గృహము గుడ్లగూబ లకు నివాసస్థానమగుగాక, ఈ యింటిపట్టున జిల్లేడు లును, ఉమ్మెత్తలును మొలచుగాక! నాలో సహస్ర ములైన శూలములు దిగబడుచున్నవి. (కత్తినెత్తి) నా పితరులు సద్గతులకు దప్పి శాశ్వత నరకమనుభ వింతురుగాక! (మరణవేదన) తెరపడును.

ఇది పంచమాంకము.

---

# ధన్యకైలాసము



## షష్ఠాంకము

(ప్రవేశము - చిత్రలత)

ఇంత దుర్మార్గమా - ఇంక రెండుమూడు నిమేషము లలో భోగేశ్వరుడు వచ్చును. ఏమి చెప్పునో? తెల్లవారు చున్నది. కంకటుని పదివేలరూపాయలిచ్చి పంపించితినిగదా! వానిబ్రతుకు వాడు బ్రతుకగలుగు. పరభృతికకు నా యొడలి నగలెల్ల నిచ్చితిని. దానితో నది పొట్టపోసుకొనగలదు. నా తక్కిన యాస్తియంతయు దాన ధర్మములకు వినియోగపడు నట్లు చేసితిని. భోగేశ్వరుని కుమార్తె యేమైనదో!

(తెరలో ధ్వని)

అదిగో! భోగేశ్వరుడు వచ్చుచున్నాడు. ఇదేమి వికృతాకారము. రాక్షసునివలె భయంకరముగానున్నాడు.

(భోగేశ్వరుడు ప్రవేశించును)

భోగే:- చిత్రలతా! చిత్రలతా!

చిత్ర:- (తొందరగా) ఏమి?

భోగే:- (రోదనము చేయును)

చిత్ర:- నీవీ రేయి ఎచ్చటికి పోతివి. మాటలాడవేమి.

భోగే:- (రోదనము)

చిత్ర:- అయ్యో! చెప్పుము.

భోగే:- మోహము వెంటబడి ధర్మము నశింపజేసితిని.

చిత్ర:- అది చాలదినములనుండి చేయుచుంటివి.

భోగే:- నేడు చేతులార ధర్మమును నశింపజేసితిని.

చిత్ర:- అయ్యా! సరిగా చెప్పుము.

భోగే:- నా వంశమును రక్షించునని దేనిననుకొంటినో దానిని నేనే హరించితిని.

చిత్ర:- రాజేశ్వరి నేమైన చేసితివా?

భోగే:- (సరుదితము) అదియేమైనదో యింతవరకు తెలియనే లేదు.

చిత్ర:- మరి నీవిట్లనునది యెవరిని గురించి.

భోగే:- ఎవరిని గురించియా! (రోదనము)

చిత్ర:- (సవేగము) అయ్యా! నన్నేల చంపెదవు. ఏదియో త్వరగా తెల్పుము.

భోగే:- నా ప్రాణప్రియను, నా భాగీరథి, నా మనోహారిణి, నా గృహదీపము-దాని రక్తముచే నా యీ చేతులు కలుషితములైనవి.

చిత్ర:- (హీనస్వరముతో) చంపితివా?

భోగే:- (సరోదనముగ) ఔను! చంపితిని.

చిత్ర:- నీవుకాదు; నేను. (పడిపోవును)

భోగే:- ఇదియేమి! ఈమె మూర్ఛ పడినదా! కాదు! మరణించినట్లున్నది. నీవు కాదు. నేనా?

( తెర పడును )

(తరువాత భోగేశ్వరుడు ప్రవేశము)

భాగీరథియట్లైనది. చిత్రలత పశ్చాత్తాపమువలన చని పోయినది. రాగలతికా రత్నగిరులట్లైనారు. రాజేశ్వరి యేమైనదో కాన్పించనే లేదు. భాగీరథి నా నుండి యీ రహస్యము దాచినది. తుదకు కంకటుడుగూడ పరారియైనాడట. నా యనుకొనువార లొక్కరైన లేరు. నాకు మృత్యువ్వురాదేమి! ఈ మహాసముద్రములో ఝంఝామారుతముచేత నటునిటు కొట్టబడిన యోడవలె నేను వడకిపోవుచున్నాను.

(భిక్షుకుడు ప్రవేశము)

(పాట-నృత్యము జేయుచు)

తెల్ల జాబిలి రేక యీవైపు
కల్లోల జలరాశి యీ వైపు
ఆనందమయ రేఖ లావైపు
అతిదుఃఖ జలరాసు లీవైపు
తెలికల్వ పూనిగ్గు లావైపు
కలిత నౌకాభంగ మీవైపు
అమృత సంగీతమ్ము లావైపు
అతిభయంకర ఘోష లీవైపు.

భోగే:- ఆహా! శాంతిసుధ వర్షించుచున్నది. స్వామీ! యోగీశ్వరా! ఈ మధువెక్కడ సేకరించినావు.

భిక్షు:- పరమహంస పరివ్రాజకాచార్యవర్య ఆనందభారతి వాక్కునుండి.

భోగే:- ఇది యేమి?

భిక్షు:- మహాసాగరము మధ్యనైవ చంద్రోదయవర్ణనము.

భోగే:- స్వామీ! తలయొగ్గితి.

భిక్షు:- ఇంకొకపాట వినెదవా?

భోగే:- మహాప్రసాదము.

భిక్షు:- ఇది నీల గగనాంగణముమధ్య మెఱయుచున్న బాల చంద్రునిగూర్చిన పాట.

భోగే:- ఏదీ!

భిక్షు:- ఇది మొగలి పూరేకు చిదిమి తెచ్చినకాంతి
ఇది నీలగగన శాంతాదేవి తలపూవు
ఇదివల్లకీ సుధానదులు పుట్టినచోటు
ఇదిముక్తి కళ్యాణమునకు పెండిలిపీట.

భోగే:- ధన్యోస్మి - ధన్యోస్మి
తరచితిని లోకమెల్ల మిథ్యాస్వభావ
మరసితిని గేహమెల్ల మోహాంధకార
మెఱిగితిని దైవతములంట ధరవాళిక్క-
శాశ్వతము నేన దేవుడన్ సత్యవాక్కు-.

భిక్షు:- ఆనందభారతి యిట్లు పాడుచుండగా నోటనుండి నా యొకటి వచ్చినది. అదియిది.
ఇట్లాగే పుట్టాను! ఇట్లాగే యున్నాను

ఇట్లాగే యీ పుట్టగోచీగో
ఎట్లాగైన గాని యీ పుట్టగోచీయె
పట్టుపీతాంబరము 'నాకు'
బాబూ మీకు దణ్ణం మీకు నే దాసుణ్ణి
నా కన్న లోకంలో రాజెవ్వడు
నాకేమియును వద్దు
ఈ కుండయే చాలు
లోకమంతా మునిగిపోయిందా!

భోగే:- ఏదీ నీ తంత్రి మరల మీటుము.

మ్రోగుచున్నది దివ్య మోహన లోక క
ళ్యాణ భావాశ్రయమైన గీతి
వీచుచున్నది శాంతివిలసదిందిందిర
సందోహమైనట్టి చల్లగాలి
పాడుచున్నది మానవ హృదంతరాళ దీ
వ్యన్నినాదమ్ము వీణారవమ్ము
రక్తి వచ్చినది పౌరాతన్య శిష్య భా
వాశ్రిత హృదయ పద్మాధికతకు.

తేటతేరిన భాగీరథీ తరంగ
శీకరచయమ్ము వారాణసీ పురమ్ము
నాల్గు దిక్కుల వార్చిందు నవ్య కేళి
పఱపుచున్నది దివ్య ప్రభాన్వితముగ.

(భిక్షు - నిష్క్ర-)]

భోగే:- (అటుచూచి) ఏడీ! భిక్షువు లేడు. లేడు. లేకపోవుట యేమి? నేనే భిక్షువును. నేన పరమాత్మను. నేన యానందభారతిని. శివోహం. శివోహం. అదుగో వారాణసి. అదుగో విశ్వేశ్వరుడు. అల్లదే కైలాసము.

ఎవడు భాగీరథీ నది మృత్యుశిరము
నందు దాల్చునో వానికి హారమగును
ఫణిఫణారత్న దివ్యప్రభావిలాస
శత సహస్రశిరుండు శేషఫణిరాజు.

అహో! కైలాసము. నా కనులకు కట్టినట్టున్నదే. అవిగో కైలాసపర్వత శృంగరజతకాంతులు. నా భ్రూమధ్య మందు జగజ్జేగీయమానముగ బ్రకాశించుచున్నవి.

పరమశివుడగు నన్ను క్షపాకరాస్య
లైన దేవాంగనలు వేత్రహస్తలగుచు
చారుకరకంకణక్వణస్వనము లెసగ
వీచుచున్నారు చల్లని పిల్లగాల్లు.

(నిష్క్రమణ)

## భరతవాక్యము

విద్యాతన్వీ రచయతు సదా నృత్య మత్యంత రమ్యం
దిగ్దేశేషు ప్రసరతు కవీంద్రామృతోక్తిప్రసారః
బృందా భూమ్యాం దదతు మురళీగాన సంతానగీతి
ర్గంగా దివ్యామృత రసధునీ క్రమలీలారసశ్చ.

